# THE DRAVIDIAN LANGUAGES

(An account of the Dravidian languages, their affiliation, and their relationship with Sanskrit and the Prakrits.)

VIDWAN G. JOGI SOMAYAJI, M.A., L.T.,
*Telugu Lecturer, Pachaiyappa's College.*





ANANDA PRESS,
MADRAS.

 [**Price Re. 1.**

# ద్రావిడభాషలు.

(ద్రావిడభాషలకుఁ బరస్పరముగల సంబంధమును సంస్కృత ప్రాకృతములతోఁగల సంబంధమును నిర్ణయించు గ్రంథము.)

విద్వాన్. జి. జె. సోమయాజి. ఎమ్, ఏ; ఎల్,టి.
ఆంధ్రభాషోపన్యాసకుఁడు.
పచ్చయప్పకళాశాల.

1931.

చెన్నపురి.

ఆనందముద్రణాలయ ముద్రితము.

వెల. 1-0-0.] [మొదటి కూర్పు.

# పీఠిక.

ద్రావిడభాషలను గుఱించి యిప్పటివఱకుఁ జేయఁబడిన సిద్ధాంతములలో ముఖ్యమగు వాని నాంధ్రులకుఁ దెలియఁ జేయు గ్రంథములు లేవని యీ గ్రంథమును వ్రాయఁ బూనితిని. ఉపలభ్యమానములగు ననేకగ్రంథములనుండి సిద్ధాంతములుద్ధృతములయి యీ గ్రంథమునందు గ్రహియింపఁబడుటయే గాక నాకుఁ దోఁచిన యనేకములగు విశేషాంశములుగూడ నీ గ్రంథమున నెలకొల్పఁబడినవి. ఇంతకుముందున్న సిద్ధాంతములను బ్రమాణమున్నను లేకున్నను దిరుగ ద్రోయుటకుఁ బ్రయత్నించినఁగాని పుస్తకమునఁ బరిశోధనము గాని, స్వాతంత్ర్యము గాని యున్నదనిపించుకొనదని యోచించు వారిలోఁ జేరిన వాఁడను గాను గావున నట్లు పూర్వసిద్ధాంతములను దిరుగఁ ద్రోయవలయునను ప్రయత్నముతో నీ గ్రంథమును వ్రాయలేదు. ఈ పుస్తకమునకు ముఖ్యముగా కాల్డ్వెల్లుగారి ద్రావిడభాషా వ్యాకరణమును గ్రియరుసనుగారి లింగ్విస్టిక్ సర్వేయును బలమగు నాధారములు. నేనుపయోగించిన గ్రంథముల పట్టికను గ్రంథమునం దిచ్చియున్నాను. పుస్తకము చదువువారికి నాయభిప్రాయము లెవ్వియో, పూర్వుల యభిప్రాయము లెవ్వియో తెలియఁగలవు గావున వానినిందుఁ దెలుపలేదు.

సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలయందున్నంతటి పరిచితి తమిళ మలయాళములందు నాకు లేదుగావున నా భాషా గ్రంథములఁ జదువుటలో నాకు సాహాయ్యముచేసిన వి. వెంకటరాజులు రెడ్డిగారికిని, నా పుస్తకమున చిరకాలములోనే ముద్రించి ముద్రణములో వలసిన సౌకర్యముల నన్నిటిని శ్రమమని యెంచకయే కూర్చిన యానందముద్రాలయాధిపతుల కును నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

మదరాసు.
25—4—31.

జి. జె. సోమయాజి.

ఈ గ్రంథమును వ్రాయుటలో నుపయోగపడిన గ్రంథములు.

Caldwell's comparative Grammar of the Dravidian Languages.

Grierson's linguistic survey of India. Vol. IV.

Beame's comparative Grammar of the Modern Aryan Languages of India.

Dr. Kittel's Canarese Grammar.

Dr. Kittel's Canarese Dictionary.

The Tamil Plutarch. By Simon Casie Chitty.

Dr. Gundert's Malayalam Dictionary.

Spring's Principles of Malayalam Grammar.

Rhenius's Tamil Grammar.

Winslowe's Tamil Dictionary.

Marshall's A Phrenologist among the Tudas.

Pope's outlines of the Grammar of the Tuda Language.

Essays in Encyclopedia Britannica.

An Introduction to comparative Philology By Gune.

Chamber's Encyclopedia. (Essays).

Sabdamanidarpana By Kesiraja. (Canarese.)

Tolkappiyam. (Tamil).

Keralakaumudi by K. Nedungadi.

Keralapaniniyam by Rajarajavarma.

Andhra Sabda Chintamani of Nannaya Bhatta.

Adharvanakarikavali.

Appakaviyam.

—•••—

# విషయసూచిక.

# I. ప్రపంచిక భాషా కుటుంబములు.



ద్రావిడభాషా స్వభావమును దెలిసికొనుటకు ముందు ప్రపంచమునందలిభాష లెన్నికుటుంబములుగా విభజింపఁబడిన వనియును నాయా కుటుంబముల స్వభావ మేమనియును మనము తెలిసికొనఁ బ్రయత్నింపవలయును. ఆవిషయమును గుఱించి మొదటఁ జర్చింపకున్నచో నడుమ నుచ్చరించు భాషాకుటుంబ ముల నామధేయములవలనఁ జొాకున కిసుమంతయు లాభము లేక పోవలసివచ్చును.

విశాలమయి యనేకజాతులతో నిండియున్న యీ ప్రపంచమునందలి జనులు మాటాడు భాషలనన్నిటిని సంపూర్ణముగాఁ బేర్కొని యయ్యవి యేయే కుటుంబములలోఁ జేరినవి యను ప్రశ్నమునకు నిశ్చయమయిన సమాధానము నొసంగుట చాల దుర్ఘటము గావున నిప్పటికి భాషా శాస్త్రజ్ఞులు ప్రాయికముగా నొప్పుకొన్న విభజనము నే యీక్రిందఁ జూపుచున్నాను.

I. ఇండోయూరపియను భాషలు:—ప్రపంచము నందుండు తక్కినభాషలన్నిటికంటెను నీకుటుంబమునకుఁ జేరిన భాషలు చాల వ్యాప్తినిజెంది మిక్కిలియుఁ బ్రాముఖ్యమును వహించి యున్నవి. ఇందలి భాషలనేకములగుటచే నీక్రిందిరీతి నంతర్భాగములుగా విభజింపఁ బడియున్నవి.

(1) ఆర్యభాషలు:—కొంతకాలమునకు ముందీనామ మిండో యూరపియను భాషలన్నిటికిని వాడఁబడుచుండెను గాని పూర్వకాలమున పర్షియాలోను నుత్తర హిందూస్థానమునందును వాడఁబడెడు భాషల నుద్దేశించియే యీ పదము వాడుట యుక్తము. ఈ తెగ భాషలు. (1) సంస్కృతము. (2) పర్షియను దేశమునకు సంబంధించిన మతగ్రంథమగు 'అవెస్త' అను గ్రంథమునందలిభాష. (3) తజ్జన్యములగు భాషలు. (4) బౌద్ధయుగమునందు హిందూస్థానములో మిక్కిలియుఁ బ్రాధాన్యమును గాంచియుండిన పాళీభాష (5) ఇతరప్రాకృతములు (6) బంగాళీ, హిందీ మొదలగు హిందూస్థాన భాషలు.

(2) ఆర్మీనియను భాషలు—తొలుత 'ఆర్మీనియను భాష' ఒక్కటిగా నుండియు నాభాష మాటాడు జనులు దేశమునుండి గుంపులు గుంపులుగా విడి వలస పోవుటచే నానాటికా యాగుంపులు మాటాడు భాషలలో నత్యంతమును భేదము కనుపట్టఁజొచ్చెను. ఈభాషకు నైదవశతాబ్దమునందు లిపి యేర్పడినదట. ఈభాషలు గ్రీకుభాషకును నార్యభాషలకును మధ్యస్థితిని బోధించు స్వభావము గలవిగా నున్నవి. ఈభాషను వాడువారు మొదట నార్మీనియాదేశమును సంబంధించినవారయ్యును టర్కీ రషియా మొదలగు దేశములలోఁ గూడ నిప్పుడున్నారు.

(3) స్లవొనిక్ భాషలు:—ఐరోపా ఖండముయొక్క తూర్పుభాగమునందును ఆసియాయొక్క యుత్తరపు భాగమునందును నీభాషలు వ్యాపించియున్నవి. వానిలోనివగు రషియా భాషాభేదములు (1) గ్రేటు రషియను. (2) లిటిలు రషియను.

(3) వెస్టర్న్సరషియను. సర్వియా, క్రోటియా, జెకోస్లొవేకియా బొహిమియా, హంగేరి మొదలగు దేశములందును నీభాషలను మాటాడుచున్నారు. బాల్టిక్ భాషలు, లిథూనియన్, లెట్టిష్, ప్రాచీనప్రుషియన్ మొదలగు భాషలును నీకుటుంబమునకుఁ జేరినవే.

(4) అల్బేనియను భాష:—ఈభాష, ఎపిరను (గ్రీసు దేశపు టుత్తరభాగముననున్న యొక దేశము) నకుత్తరమున నున్న పర్వతప్రదేశములయందును, మాంటినీగ్రోకు దక్షిణపు భాగమునను ఎడ్రియాటిక్కునకుఁ దూర్పుభాగమునను సుమారు పదిలక్షల జనులచే మాటాడఁబడుచున్నది.

(5) గ్రీకుభాష— ప్రస్తుతము గ్రీసు, అనంబడెడు దేశమునం దీభాష మాటాడఁబడుచుండెను. ఈభాషలోననేక మాండలిక భేదములున్నవి. (i) ఇయోలిక్. దీనిని గ్రీసున కుత్తరభాగమునను, ఆసియా మైనరులోని వాయవ్య భాగమునను మాటాడుదురు. (ii) ఆట్టిక్ అయోనిక్. అట్టికాలోను ఆసియామైనరు మధ్యభాగమునను, ఈజియను దీవులలోను, ఆసియా మైనరుతీరపు మధ్యభాగమునను, నీ భాషాభేదము వాడుకలోనున్నది. (iii) డోరిక్—ఎపిరస్ మొదలుకొని పెలపొనెసీసువఱకును, తేరా, మీలస్, క్రీటు, సిసిలీ మొదలగు దీవులలోను నియ్యది ప్రచారములో నున్నది.

(6) ఇటలీలోని భాషలు:—ఈభాషలకు మూలమయినది లాటినుభాష. ఇయ్యది మొట్టమొదట నిటలీదేశములో నొక్క భాగమున టైబరునదికి దక్షిణమున మాత్రమే వాడఁబడుచుండెడిది. కాలక్రమమున నియ్యది చాలదూరము

వ్యాపించి యిటలీ దేశమునంతటిని నల్లుకొనినది. ఉంబ్రియను, ఓస్కాను, పిలిగ్నియను అను భాషాభేదములు లాటినుభాషకుఁ జేరినవే. మెస్సాపియన్, ఎట్రుస్కాన్, లిగూరియన్ మొదలగు మాండలిక భేదములును బయివానికిఁ జేరినవే యయి యున్నవి.

(7) కెల్టిక్ భాషలు—ఇప్పుడు ఫ్రాన్సు అనఁబడుదేశమునకుఁ బూర్వము గాలియా యని పేరుండెడిది. ఈదేశము వారు బ్రిటనునకు వలసపోయిరి. వెల్షుభాషయు, ఐర్లండులోని భాషయు, స్కాంట్లండులోఁ గొంత భాగమునందు మాటాడఁబడు భాషయు, ఐల్ ఆఫ్‌మాన్ అను పేరుగల దీవిలో మాటాడు భాషయును నీ భాషకు సంబంధించినవి.

(8) పయిదేశమునకు నీశాన్యమున జెర్మను భాషలను మాటాడు జనులున్నారు. అయ్యవి మూఁడు భాగములుగా విభజింపనగును. (i) గాతిక్—డాన్యూబ్ నది యొడ్డున నాల్గవ శతాబ్దమున వాడుకలో నుండెను. (ii) నార్సుభాష–ఈభాష క్రీ॥ శ॥ 1000 సం॥ వఱకును నొక్క భాషగానుండి డేనిష్, స్వీడిష్, నార్వేజియన్, ఐస్లాండిక్ భాషలుగా మారినది. (iii) పడమటి జెర్మను భాష, హై జెర్మను,లో జెర్మను, హాలండు బెల్జియము దేశముల భాష, ఇంగ్లీషు మొ॥ యీజాతికిఁ జేరినవి.

ఈ పయి విభాగములు ప్రసిద్ధములు. ఇవి గాక నూతనమగు పరిశోధనమువలనఁ గ్రొత్తక్రొత్త భాషలు పయి పట్టికకుఁ జేర్పఁబడుచున్నవి.

II. సెమిటిక్ భాషలు :—ఇండోయూరపియన్ భాషల తరువాతఁ బ్రాముఖ్యమును వహించిన భాషలియ్యవి. ఆసియా యొక్క నైరృత భాగమున ననఁగా, అరేబియాలోను, మధ్యధరా సముద్రము ఆసియా మైనరు ఆర్మీనియా యనువానికి మధ్యభాగమునను్న ప్రదేశములందును, పర్షియా, పర్షియన్ గల్ఫ్ ఎఱ్ఱసముద్రములదరిని, ఈజిప్టు మొదలగు వానియందు నివసించు జనులకును సెమైటులు అని పేరు. వారు మాటాడు భాషలు సెమిటిక్ భాషలు ఈ భాషలను నాలుగు భాగములుగా విభజింపనగును.

(1) తూర్పు సెమిటికు—ఈభాష బేబిలోనియా ఎస్సిరియాయను దేశములలో వాడఁబడుచుండెను. క్రీ॥ పూ॥ ఇది యీజిప్టులోఁగూడ వాడఁబడెననుటకు నిదర్శనములున్నవి. ఆఱవ శతాబ్దమునకే యీభాష వ్యవహార భ్రష్టమగుచుండెనని చెప్పనగును.

(2) పడమటి సెమిటికు భాషలు—ఈభాషాభేదములు సిరియాలోను, పాలస్టీనులోను బూర్వము వాడఁబడుచుండెను. ఏమొరైటు లేక కానొనైటు భాషలని వీనినే చెప్పుదురు. మొయబైటు, ఫినీషియను, హీబ్రూమొ॥ యీ తెగకుఁ జేరినవి.

(3) ఉత్తరపు సెమిటిక్ లేక అరమేయిక్ భాష—ఈ భాష ముఖ్యముగా క్రీ॥ పూ॥ సిరియా దేశమునఁ బ్రాముఖ్యమును వహించియుండెను.

(4) దక్షిణపు సెమిటిక్ భాషలు—ఈ తెగలో ముఖ్యమయినది ప్రాచీనపు టరబ్బీభాష. పయియారమేయిక్ భాషను గ్రమక్రమమున నియ్యది యణచి వేసినది.

III. ఫిన్నో ఉగ్రియన్ భాషా కుటుంబములు:—ఈ కుటుంబమునకుఁ జేరిన భాషలు యూరల్ పర్వతముల కిరు పార్శ్వములయందున్న జనులచేతను బాల్టిక్ సముద్రము యొక్క తూర్పుతీరము నందున్నవారిచేతను వాడఁబడు చున్నవి. వీరందఱును గుంపులు గుంపులుగా నివసించుచుఁ జాలమట్టునకు స్థిరజీవనము లేక దేశాటనముఁ జేయుచుం దురు. వీరిలోనున్న మాండలిక భేదములచే ననేక మాండలిక భాషాభేదములు గూడ బయలుదేరినవి. ఈ ఫిన్ అనుపదము ఫిన్లండు నందుండువారిని, రషియా దేశమునందలి సజాతీయపు దెగలవారిని గుఱించి యుపయోగింపఁబడినది. ఎస్టోని యను గుంపులు, లాప్పులు, చెరెమిస్సులు, మార్డ్వినులు, ఫెర్మియన్ గుంపులు మొ॥ వారు ఫిన్ను జాతికిఁ జేరినవారు. యూరల్ పర్వతప్రాంతములనుండు ప్రదేశమునకు ఉగ్ర యని పేరుండుటచే వీరందఱును 'ఉగ్రియనులు' అనఁబడుచున్నారు. ఓస్టియాకులు, మాగియారులు, వొగులులు మొ॥ వారలీ తెగకుఁ జేరినవారు. వీరందఱును ఫిన్నో ఉగ్రియనులను సమష్టి నామధేయముతో నుదాహరింపఁ బడుచున్నారు గావున వారు మాటాడు భాషలకును ఫిన్నో ఉగ్రియను భాషలను పేరు వాడుకలో నున్నది.

ఈ భాషలకు నిండో యూరపియన్ భాషలతో దూర మగు సంబంధముగలదు. సామోయెద్ భాషలతోఁగూడ వీనికి సంబంధముగలదు. ఈ సామోయెద్ జాతివారు ఐరోపా ఆసియాఖండములయుత్తరపు భాగములయందు ఓబి నది గట్టు ళయందు వసియించుచున్నారు. వీరు వేటచేతను, చేపలఁ

బట్టుటచేతను జీవింతురు. తోళ్లదుస్తులను ధరించి యెముకల తోడను రాలతోడను దయారు చేయఁబడిన యుపకరణముల నుపయోగింతురు.

ఫిన్నో ఉగ్రియన్ కుటుంబములోని భాషలు :—(1) లాప్ప్‌భాష—ఈభాష సుమారు ముప్పదివేలమంది ద్రిమ్మరులచే వాడఁబడుచున్నది. నార్వే, స్వీడను, ఫిన్లండు దేశముల యుత్తరభాగములయందును రషియాయందలి కోలాద్వీపకల్పమునందును వీరు వసింతురు.

(2) బాల్టిక్ ఫిన్నిష్ భాషలు :—(a) ఫిన్నిషుభాష-ఇయ్యది ఫిన్లండులో చాలభాగమునందును నుత్తరపు స్వీడను, నార్వే రషియాదేశములందలి కొన్ని ప్రదేశములయందును సుమారు ముప్పదిలక్షలమంది జనులచే మాటాడఁబడుచున్నది. ఈభాషలో 19-వ శతాబ్ద మధ్యమమునుండి సారస్వతము పెరిగి యభివృద్ధి నొందుచున్నది. (b) కరెల్‌భాష—దీనినే రషియను కరెల్ భాషయందురు. (c) ఒలొనెట్సు—లడోగా కుత్తరభాగమున మాటాడుచున్నారు. (d) లిడి మాండలిక భేదములు—ఈభాషలు పయిదేశమునకుఁ దూర్పుభాగమున వాడఁబడుచున్నవి. (e) వెప్సెభాష—ఇయ్యది 'ఒనీగా' సరస్సునకుఁ బశ్చిమోత్తర భాగమునఁ బ్రచారములోనున్నది. (f) వొత్‌భాష—ఇయ్యది ఇంగర్‌మేన్లాండునకు వాయవ్యపు భాగమున సుమారొక వేయి కర్షకులచే మాటాడఁ బడుచున్నది. క్రమముగా నశించుచున్నది. (g) ఎస్తోనియన్ భాష—ఎస్తోనియారిపబ్లిక్‌వారి చేతను, రషియా, సైబీరియా, లెట్ట్‌లండు దేశములకు వలసపోయిన వారిచేతను సుమారు 14

లక్షల జనులచేత వాడఁబడుచున్నది. గడచిన నలువది సంవత్సరములలో నియ్యది యభివృద్ధినిగాంచి సారస్వతమును బెంపొందించుచున్నది. (h) లివ్ భాష—కోర్ లండుయొక్క యుత్తర భాగమున సుమారు 3 వేల జాలరులు దీనిని వాడుచున్నారు, (3) మార్డ్విన్ భాష—మొక్ష, ఎర్జ, యను రెండు మాండలిక భేదములుగలిగిన యియ్యది పదిలక్షల జనులచే వ్రోల్గానది కిరుప్రక్కలను వాడఁబడుచున్నది.

(4) చెరెమిస్ భాష— వ్రోల్గానది కిరుప్రక్కలను యూరల్ యొక్క దక్షిణ భాగమునను నియ్యది సుమారు 375000 కర్షకుల వాడుకలోనున్నది.

(5) పెర్మియన్ భాషలు-ఇందు వ్రోటియాక్, జెరియన్ అను రెండు భేదములుగలవు. మొదటిది కామా, వ్లట్కా నదులనడిమి ప్రదేశమున 425000 కర్షకులచే వాడఁబడుచున్నది. రెండవది వైచెగ్డా, మెజెన్. పెచోరా, కామా మొదలగు నదులయొడ్డులను కోలా ద్వీపకల్పమునందును 250000 జనుల వాడుకయందున్నది.

(6) ఓబ్ ఉగ్రియన్ భాషలు—(i) వ్రోగుల్ భాష—యూరల్ మధ్యప్రదేశముల నక్కడక్కడ 5000 సంఖ్యగల కర్షకులు జాలరులు మొ॥ వారిచే వాడఁబడుచున్నది. (ii) ఓస్టియాకు భాష—ఓబ్, ఇర్టిష్ నదులయొక్కయు వాని యుపనదులయొక్కయు ప్రాంతములందు 20000 జాలరులు, వేటకాండ్రు మొదలగువారిచే నుపయోగింపఁబడుచున్నది.

(7) హంగేరియను భాషలు......హంగరీదేశమున వాడఁబడునవి. పయిఁజెప్పఁబడిన ఓబ్ ఉగ్రియను భాషలును హం

గేరియను భాషలును గలిసి ఉ(గ్రియను భాషలనఁబడుచున్నవి. టర్కో టార్టారిక్, మంగోలియన్, మంచు తుంగస్ భాషల తోడను గొందఱ (ప్రకారము జపానీస్ భాషతోడనుగూడ నీ ఫిన్నిష్ ఉగ్రోభాషలు సంబంధమును గలిగియున్నవి. ఇండో యూరపియను భాషలకును, బయి ఫిన్నిష్ ఉగ్రోభాషలకును దూరసంబంధమున్నదని యూహింపఁబడినదిగాని యది యెట్టి దియో యింకను నిర్ణయింపఁబడలేదు. ఇండో యూరపియను భాషలలోనుండి యనేక పదములను వీరు గ్రహించిరి. అందు ముఖ్యముగా నిరేనియన్ పదములు ప్రాచీనము లయినవి. ద్రావిడభాష లీకుటుంబమునకుఁ జేరినవని కాల్డ్వెల్లుగా రభి ప్రాయ పడుచున్నారు.

IV. కాకసస్ భాషలు:—అనేకములగు నీ భాషలు పర్వతప్రాంతములందు వాడఁబడుటచే మిక్కిలి ప్రసిద్ధములు కావు. జార్జియను, మింగ్రీలియను, సర్కేసియను, లెస్ఘియను భాష లిందు ముఖ్యమగునవి.

V. చీనా భాషా కుటుంబము:—తూర్పుటాసియాలో చీనా దేశమునందు నలువదికోట్ల జనులచే నీ చీనాభాష యుపయోగింపఁ బడుచున్నది. దీనిలో వ్యాకరణముగాని ప్రత్యయముల కూడికగాని లేదు. వాక్యమునందు బదమున కీయఁబడు స్థానముచేతనే దానియర్థమును గనుఁగొనవలయును. భాషా పరిణామమునందు చీనాభాష మిక్కిలియుఁ బ్రాథమిక స్థానము నాక్రమించుచున్నదని యొకకాలమునం దభిప్రాయ పడిరి. కాని యా యభిప్రాయ మిప్పుడు కొంతవఱకు మారినది.

బర్మీస్, సయామీస్, తిబెటన్ భాషలు పయిదానికి సంబంధించిన వానివలెనే యున్నవి.

VI. ముండా భాషలు:—ఈ భాషలు చాల నల్ప సంఖ్యాకులచే వాడఁబడుచున్నవి. చోటానాగపురపు పీఠభూములయందును వానికి దగ్గఱనున్న మద్రాసు రాజధానియొక్కయు, మధ్యపరగణాలయొక్కయు భాగములలోను మహాదేవు కొండలలోను నీభాషలు వాడఁబడుచున్నవి. ఖెర్వారీ భాషాభేదములు, కొరవభాష, కూర్కుభాష మొ॥ యీ కుటుంబములోనివి. సవర గదబ భాషలును వీనికి సంబంధించినవియే. ఈ ముండాభాషలు సాధారణముగాఁ గొండలయందే వాడఁబడును. ఈభాషలు ఆస్ట్రికు కుటుంబములతో సంబంధము గలవనఁదగును.

VII. మలయాపాలినీషియను భాషలు:—ఈభాషలు మడగాస్కరునుండి 'ఈస్టరు ఐలండు'వఱకును వాడఁబడుచుండును. ఇవి నాలుగు రకములు. (1) ఇండోనేసియన్ తెగ—ఫిలిప్పైనులు, సెలబస్, మడగాస్కరు, సుమత్రా, జావా, దేశములలో నియ్యవి వాడఁబడుచున్నవి. (2) మెలనేసియన్ తెగ—ఇవి ఫిజిదీవులలో నధికముగా వాడుకలో నున్నవి. (3) మైక్రోనేసియన్ తెగ-గిల్బర్టు, మార్షల్, కారొలైను, మారియన్నీదీవులు, యాప్ దీవి మొ॥ వానియందు దుపయోగపడుచున్నవి. (4) పొలినీషియన్ భాషలు-ఇవి సామైటీ దీవులు

టోంగా, ఈస్టరుదీవి, న్యూజీలాండులోని మావోరిలోను వాడుకలో నున్నవి.

VIII. పాపువన్ భాషలు—న్యూగినీయందును సమీపమునన్న చిన్నచిన్న దీవులయందును నుపయోగపడుచున్నవి.

IX. ఆస్ట్రేలియాయందలి దేశీయులభాషలు—వీనికిని ముండా భాషలకును సంబంధమును గొందఱు చెప్పుదురు.

X. సూడాన్‌గినీ దేశభాషలు—ఇందు ముఖ్యమయిన హౌసాభాష ఆఫ్రికాయందలి యుత్తరభాగములోని నీగ్రోలచే నుపయోగింపఁబడుచున్నది.

XI. బంటు భాషాకుటుంబములు—ఇయ్యవి దక్షిణపు నైగీరియానుండి కేప్ ఆఫ్ గుడుహోప్ వఱకును గన్పట్టుచున్నవి.

XII. బుష్‌మెన్ హాట్టెన్‌టాట్ భాషలు— ఇయ్యవి. క్రమక్రమముగా నశించుచున్నవి. బుష్‌మెన్ భాషలు దక్షిణాఫ్రికాలో వాడఁబడుచున్నవి. హాట్టెన్‌టాట్ భాషలు నైఋతపుటాఫ్రికాలో నుపయోగింపఁబడుచున్నది.

XIII. అమెరికాదేశమునందలి ప్రాచీనవాసుల సంతతివారిచే వాడఁబడుభాషలు.

ప్రపంచమునందు వాడఁబడెడు భాషలన్నియును బయిప్రకారము వేర్వేఱు కుటుంబములుగా శాస్త్రజ్ఞులచే విభజింపఁబడియున్నవి. పయిపట్టికనుబట్టి యేయేభాషలే యే దేశములందుమాటాడుచున్నారో తెలిసికొనుటకనుకూలముగా నుండుననియుఁ బయిభాషల కుటుంబవిభాగములు తెలిసిననే గాని

ద్రావిడభాషలకుఁ బ్రబంచభాషలయందుఁ గల స్థానమును దెలిసికొనుట కవకాశము లేదనియును నీ విషయమును మొదట వివరించితిని. మనద్రావిడభాషలతో సంబంధించినవి యార్యభాషలును ఫిన్నిష్ఉగ్రోభాషలును గావున వానిని గుఱించి విపులముగా వ్రాయఁబడినది.

---

# II. ప్ర క ర ణ ము.

---

## ద్రావిడభాషలనెవ్వి ? వానికిఁగల పరస్పరసంబంధమెద్ది ?

ద్రావిడభాషలెవ్వియో యనునంశమును నిర్ణయించుటకు ముందాభాషల కీయఁబడిన సమష్టినామధేయమగు ద్రావిడశబ్దమునుగుఱించి కొంచెము ముచ్చటింపవలసియున్నది. ఈ శబ్దము సంస్కృతపుస్తకములయందు వాడఁబడియున్నది. ద్రవిడశబ్దమొక జాతిజనులను దెలియఁజేయుచు మహాభారతమునందును మనుస్మృతియందును వాడఁబడియున్నది. ద్రావిడీభాషయొక ప్రాకృతభాషాభేదమని తెలుపఁబడియున్నది. ఇంతియగాక సాధారణముగా హిందూదేశమునందలి జనులను విభజించు నప్పుడు పంచద్రావిడులనియుఁ బంచగౌడులనియుఁ బూర్వపుపండితులు చెప్పుచుండుట మనకుఁ బరిచితమగు విషయమే. కుమారిలభట్టు 'ఆంధ్రద్రావిడభాష' యను పదము నుపయోగించెననియు నయ్యది దక్షిణదేశభాషలనుద్దేశించి వాడఁబడిన దనియునుఁ దెలియుచున్నది. శబ్దకల్పద్రుమమునందు ద్రావిడభాషలను బేర్కొను నొక్కశ్లోకముదాహరింపఁబడినది. అందు, ద్రావిడము (తమిళము) కర్ణాటము, గుజరాతీ, మాహారాష్ట్రీ, తెలుఁగు, అనునయిదుభాషలును నుదాహరింపఁబడినవి. సిద్ధాంతమునందు గుజరాతియునుమాహారాష్ట్రియును నార్యభాషలుగాని ద్రావిడభాషలుగావనియు నా

భాషలకును దక్కిన ద్రావిడభాషలకును గల భేదమును జక్కఁగా నెఱుంగక పోవుటచే నీ శ్లోకమున నయ్యవిచేరుపఁ బడినవనియుఁ జెప్పనగును. ఈ ద్రావిడశబ్దమే ద్రమిళమను రూపముతో వాడఁబడుచున్నట్లు కొన్ని సంస్కృత గ్రంథము లలో నిదర్శనము లున్నవి. రామానుజాచార్యుల వారు తమ వేదార్థ సంగ్రహమునందు ద్రమిళాచార్యైః అనియుఁ బండిత రాయ జగన్నాథరాయలు తన రసగంగాధరమున ద్రవిడశిగో మణిభిః అనియు వాడియున్నారు. పయియుదాహరణములఁబట్టి డాక్షిణాత్యులను గుఱించియు వారి వేషభాషలను గుఱించియు మాటాడు నప్పుడు ద్రావిడపదము పూర్వులచే నుపయో గింపఁబడెననుట నిర్వివాదము.

ఇఁకఁ బ్రస్తుతకాలమున నఱవమను నామాంతరమున నొప్పు తమిళభాషకుఁగల తమిళమనుపేరు సంస్కృత భాషా పదమగు ద్రావిడ శబ్దభవమని కాల్డ్వెల్లుగా రభిప్రాయ పడు చున్నారు. ఈ శబ్దము మొదట ద్రమిడమను రూపముతో నుండి తరువాత ద్రవిడమను రూపమునుదాల్చి, భాషా స్వభావము ననుసరించి డకారమునకు లకారమురాగా ద్రవిల ద్రమిళ, యను రూపము లేర్పడినవనియుఁ బ్రాకృతము నందు ద్రోహశబ్దము దోహశబ్దముగాను, శ్రమణశబ్దము సమణ శబ్దముగాను మారినట్లే, నియ్యదియు దమిలమయి, యాదిమ దకారము తమిళమునందుండదు గనుక తమిలము, తమిళము, అను రూపము లేర్పడి యుండవచ్చుననియు కాల్డ్వెల్లుగా రూహించుచున్నారు. ఇఁకఁ దమిళపండితులు పయి వ్యుత్పత్తి నొప్పుకొనక తమ భాష సంస్కృతముకంటెను బ్రాచీన మని

యను నద్దానిపేరు తద్భవశబ్దమగుట యసంభవము గావున నయ్యది దేశ్యమేయనియును దాని కర్థము 'మధురమయినది' యనియును వాదించుచున్నారు. ఈపదము సంస్కృత భవమా కాదా యని నిర్ణయించుట కవకాశములు లేవుగాని తమిళ పండితులు మాత్రము తమభాష ప్రాచీన మయినదనియును సంస్కృత సాహాయ్య మక్కఱలేకయే యది వర్ధిల్లెననియును నిర్ణయించుటయందు మిక్కుటమగు నభిలాష గలవారుగాఁ గనుపట్టుచున్నారు గావునను వారి వ్యుత్పత్తికి సరియగు నాధారము లేకపోవుటచేతను కాల్డ్వెల్లుగారు చెప్పు వ్యుత్పత్తి భాషాపరిణామపద్ధతులకును యుక్తికిని సరిపోవుచుండుటచేతను నింతకంటె మంచి యుక్తిచెప్పి దీనిని ఖండించు వఱకును మనము కాల్డ్వెల్లుగారి సిద్ధాంతమునే యాశ్రయింప వలసి యున్నది.

ద్రావిడమను పదము సంస్కృత భవమయినను గాకు న్నను నీకాలమునందు మాత్రము దాక్షిణాత్య భాషలను బోధించునట్లు వాడఁబడుచుండుటచేతను, బూర్వమునందును నీపదము తత్సదృశార్థముననే యుపయోగింపఁబడెడి దనుటకు బలమయిన యుదాహరణము లుండుటచేతను ప్రకృతభాషలను ద్రావిడభాషలనుటలో విప్రతిపత్తిలేదుగదా! ఇంతకును దాక్షిణాత్య భాషా శాస్త్రకారులందుఁ బ్రథమ స్థానము వహియించియున్న కాల్డ్వెల్లుగారు మొ॥ పండితులును దేశీయ పండితులును నీపదము నీయర్థముతోడనే వాడిరి గావున మనమును నీపదము నేతదర్థమునందే ప్రయోగింపనగును.


ప్రాచీనద్రావిడభాష.
తమిళము
మలయాళము
తుళు
కొడగు
తోడా
కోట
కన్నడము
కురుఖ్
మాల్తో
గోండీ
కూయీ
కోలామీ, మొ॥
తెలుగు
బ్రాహూయీ

కాల్డ్వెల్లుగారు తమగ్రంథమున ద్రావిడభాషలని పేర్కొనినవి (బ్రాహూయీ భాషగాక) 12 భాషలు. అందు మొదటియాఱును నభివృద్ధిఁజెంది నాగరకతతో వెలయుభాషలు. మిగిలిన యాఱును నట్టివిగావు.

(1) తమిళము. (2) మలయాళము. (3) తెలుఁగు. (4) కన్నడము. (5) తుళు. (6) కుడగు. (7) తుద. (8) కోట. (9) గోండ్. (10) ఖోండు. లేక కుభాష (11) ఒరయాను. (12) రాజమహాలు.

ఇఁక గ్రియర్సను దొరగారు తమ (Linguistic survey of India) అను గ్రంథములోఁగొన్ని భాషలను ద్రావిడ భాషలుగాఁ బేర్కొని వాని యుత్పత్తి క్రమమును బరస్పర సంబంధమును దెలియునట్లుగాఁ బ్రక్కపుటలోని వంశవృక్షమును వ్రాసియున్నారు.

కాల్డ్వెల్లుగారి పుస్తకములో లేని పేళ్లు కొన్ని యధికముగా గ్రియరుసను గారిచే నీయఁబడినట్లు తోఁచుచున్నది. తొౘద, లేక తుద యను రెండు శబ్దములును నొక్కభాషనే తెలుపునవి. కాల్డ్వెల్లుగారు వ్రాసిన 'ఓరయాఁ' భాషయును గ్రియరుసనుగారి కురుఖ్ భాషయును నొక్కటి యని గూడ నిశ్చయమగుచున్నది.

మాల్తోభాషనే రాజమహలు భాషయనిగాని మాలర్ భాష యని గాని వ్యవహరించుచున్నారు. గోండు, లేక గోండీ, యనుపేళ్లు రెండును నొక్కభాషనే బోధించుచున్నవి. కూయి, కంధీ, లేక కోండు, అను పేళ్లు మూఁడును నొక్క భాషనే దెలుపును. ఇఁకఁ బయి యిరువురి పట్టికలలో నొక్కదాని

యందు కోలామీ మొ॥ అను భాషాభేదములు మాత్రమధిక ముగాఁ గనుపట్టుచున్నవి. ఈ గుంపునకుఁ జేరిన మాండలిక భేదములు. (1) కోలామీ (2) భీలీ (3) నాయకీ అనుభాషలు. వీనిని గోండు భాషయొక్క మాండలిక భేదములుగా కాల్డ్వెల్లు గారు భావించియున్నారు గావున వానిని స్వతంత్ర భాషలుగా నుదాహరింపలేదని యూహింపనగును. పయి నుదాహరించిన భాషలను గుఱించి కొంచెము కొంచెముగా నీక్రింద వ్రాయఁ బడుచున్నది.

I. తమిళము—ఈభాష దక్షిణ హిందూస్థానమునందు మిక్కిలిగా వాడఁబడుచున్నది. దీనిని మాటాడు జనుల మొత్తపు సంఖ్య ఒకకోటి డెబ్బదిలక్షలు. ఇందు మదరాసు రాజధానికిని సింహళ ద్వీపమునకును జేరిన వారు సుమారు 16,857,659. (1901–వ సం॥ జనాభా లెక్కలు.) ఇతర స్థల ములయందలి వారు 568,172. ద్రావిడభాషలన్నిటియందును బ్రాచీనమగు సారస్వత మీభాషయందే బయలు వెడలినది. ఇందు మొదటి గ్రంథమగస్త్యులు వ్రాసిన వ్యాకరణమని చెప్పుచున్నారు. తొల్కాప్పియర్ అనువారిచే వ్రాయంబడిన తొల్కాప్పియము రెండవదని తెలియవచ్చుచున్నది. దీని కాలము నిర్వివాదముగా నిశ్చయింపఁబడలేదు. అయినను దీనిని క్రీ॥ పూ॥ వ్రాయఁబడిన దానినిగాఁ గొందఱు పరిగణించు చున్నారు. ఏసారస్వతము సందయినను బ్రథమమున లక్ష్య గ్రంథములు బయలుదేరుటయు వానివెనుక లక్షణ గ్రంథ ములు బయలుదేరుటయు ననుభవసిద్ధమును యుక్తిసహమును గావున నింతకు మున్నే తమిళభాషయందు గ్రంథములుండి

యుండవలెననియు నయ్యవి యే కారణముననో నశించిపోయి యుండవచ్చుననియుఁ గొందఱు తమిళపండితు లభిప్రాయ పడుచున్నారు. పదియవ శతాబ్దమునకుఁ బూర్వమునందుండిన 'తిరువళ్లువారు', అను నాయన తిరుక్కురళ్ అను నొక గ్రంథ మును వ్రాసియున్నారు. అది వేదాంతము ప్రధానముగాఁగల యొక పద్యకావ్యము. పావనండియను నాయన రచియించిన నన్నూల్, అను వ్యాకరణము దాండియాలంకారము అను లక్షణ శాస్త్రమును నీభాషయందు సుప్రసిద్ధ గ్రంథములు. ఇంతియగాక నాలడియార్, కంబరామాయణము, మణి మేగలై, సిలప్పదిగారమ్, అను గ్రంథములుకూడ సుప్రసిద్ధ ములు. ఈ భాషయందు విశాలమయినదియు సంస్కృతభాషా సారస్వతములపయి నంతగా నాధారపడనదియునగు సారస్వత మున్నట్లు తెలియవచ్చుచున్నది

కొఱవలు లేక యెఱుకులు, అను పేరుగల యొకానొక జాతి ద్రిమ్మరులగు జనులు వాడు భాషకు కొఱవ భాషయని పేరనియును నా భాష మాటాడువా రనేకులు హిందూదేశము నందలి యనేక భాగములలో నున్నారనియును నా భాష తమిళభాషయొక్క మాండలికభేదమువలెనే యున్నదనియును గ్రియరుసనుగా రభిప్రాయపడుచున్నారు. వీరి సంఖ్య 52626. ఈ పయిజాతివారు గాక కైకడీజాతివారును, బుర్గండీవారును అని వ్యవహరింపఁబడు రెండుజాతుల జనులు ద్రిమ్మరి జీవనము చేయువారనియును, చాపలల్లుట మొదలగు పనులచే జీవించు చున్నారనియును వారు మాటాడు భాషలు గూడ భ్రష్టము లగుటచే వేఱుపడిన తమిళభాషా భేదములే యనియును గ్రియరు

సనుగారు వ్రాయుచున్నారు. వీరిలో కైకడీ జాతివారు బొంబాయి రాజధానియందును బీరారునందును, మధ్యపరగణాలయందును దిరుగుచు నుందురు. వీరి జనసంఖ్య 14598. బుర్గండీ తెగవారు మధ్య హిందూస్థానపు మన్యములలోఁ దిరుగుచు జీవించుచున్నారు. వీరి జనసంఖ్య 673.

II. మలయాళము:—హిందూదేశమునందు సుమారు ఇరువదిలక్షలమంది జనులు మలయాళమును మాటాడు చున్నారు. ఈ మలయాళమను పదమునకు మలయాళ్మ యనియును, మలయాయ్మయనియును నామాంతరము లున్నవనియును, మలయనగాఁ గొండయనియును ఆళ్మయనఁగా ప్రదేశము (ఆళ్.—పరిపాలించు) అనియును నర్థము గావున నీ పదమునకుఁ గొండప్రదేశమర్థమనియు కాల్డ్వెలుగారి సిద్ధాంతము. ఈ ప్రదేశమునకు సంస్కృతమునందు కేరళమను పేరు గలదు. ఆ పదమే కకారము చకారముగా మారి చేరళము, చేరము అను రూపములను దాల్చినదని యూహింపఁబడినది.

ఈ మలయాళభాష ప్రాచీనకాలమునఁ దమిళముతోన భిన్నముగా నుండెననియు నీ రెండు భాషలకును గలిపి ద్రావిడమనియే సంస్కృతమునందు వాడుక యుండుట యీ యభిప్రాయమును బలపఱచుచున్నదనియును మలయాళభాషాస్వభావజ్ఞు లూహించుచున్నారు. ఇయ్యది కొంతకాలమునకు ముందే తమిళమునుండి విడువడి యుండవచ్చును. పశ్చిమతీరమున, కాసరగోడునుండి దక్షిణముననున్న తిరువందిరమువఱకును నీ భాష వాడుజనులు నివసించుచున్నారు. ఈ దేశమునకుఁ బ్రాక్పశ్చిమపు టెల్లలు పడమటి కనుమలు, అరేబియా

సముద్రమునని తెలియనగును. గ్రాంథికపు మలయాళము వాడుక మళయాళముకంటెం దమిళమునకు మిక్కిలియు సన్నిహితమైకనబ్బుచున్నది. తమిళములోవలెం గాక యాంధ్రకర్ణాట భాషలలోవలె నిందు సంస్కృతపదము లత్యధికముగాం జేరుపంబడియున్నవి. తెనుగునం బ్రయోగింపంబడని సంస్కృత విభక్తి రూపములు మొదలగునవి మణిప్రవాళమను శైలీ భేదముగా నిందు విశేషము వాడంబడుచున్నవి.

ఈ భాషయందును సారస్వతము చక్కంగా నభివృద్ధిం జెందియున్నది. 13 లేక 14-వ శతాబ్దమునకుం జెందినదని చెప్పందగిన రామచరితమను పద్యకావ్యమే ప్రాచీన గ్రంథముగాం గనబ్బుచున్నది. దీనికంటె ముందు శాసనములు మాత్రము కానవచ్చుచున్నవి. పదునేడవ శతాబ్దమున మహాభారతముగూడ ననువదింపంబడి మలయాళ సారస్వతమునం బ్రధాన గ్రంథమయి యలరారుచున్నది. అనంతరము నల చరిత్రము, పంచతంత్రము మొ॥ గ్రంథములన్నియు భాషాంతరీకరింపంబడి సారస్వతమునం జేర్పంబడినవి. ఇంతియగాక నవీనులచే నభిజ్ఞాన శాకుంతలము మొదలగు నాటకములు. నవలలు భాషాంతరీకరింపం బడియున్నవి.

ఈ భాషకు డాక్టరు గుండెర్టుగారు మలయాళములో నొక వ్యాకరణమును రచియించిరి. అటుతరువాత కేరళ పాణినీయమను ప్రామాణిక వ్యాకరణము రాజరాజ వర్మగారిచే వ్రాయంబడెను.

III. తెలుంగు—నాగరకతయొక్క ప్రాచీనతయందును పదబాహుళ్యమునందును నియ్యది తమిళముతప్ప మిగిలిన

ద్రావిడ భాషలన్నిటికంటెను నధికమని చెప్పఁదగుననియు మాధుర్యమునందు ద్రావిడభాష లన్నిటిలోఁగూడఁ బ్రథమ మనియు కాల్డ్వెల్లుగారు చెప్పుచున్నారు.

[ఈ యభిప్రాయము తెనుఁగువాఁడనగు నేను వ్రాయుట కంటె కాల్డ్వెల్లుగారు చెప్పినదానినిగా వ్రాయుటయందు విలువ యధికమని యట్లే వ్రాసినాఁడను.]

మిగిలిన యేద్రావిడభాషను మాటాడు జనులకంటెను గూడఁ దెలుఁగుమాటాడు జనులసంఖ్య యెక్కువ. ఇది రెండు కోట్లు.

తెలుఁగు అనుపదముయొక్క వ్యుత్పత్తినిగుఱించి యనేకములగు భిన్నాభిప్రాయములున్నవి. ఇది త్రిలింగ శబ్దభవమనియు, ఆత్రిలింగ శబ్దము దేశనామమనియుఁ గొందఱు చెప్పుచున్నారు. త్రినగ శబ్దభవమని మఱికొందఱు పల్కుచున్నారు గాని యీవ్యుత్పత్తి యుక్తముగానున్నట్లు తోఁచదు. తేనె అనుపదమునుండి తెనుఁగు అనునది వచ్చినదని వాదించువారు గూడనున్నారు. తెలి (తెలియు) అనుధాతువునుండి వచ్చినదనియు తెలుఁగుఅనుపదమునకుఁ దెలియుట యర్థమనియు మఱియొక కల్పన చేయఁబడినది. ఆంధ్రదేశమునందలి భాగమగు కళింగ శబ్దము కలుఁగు, అను తెనుఁగుధాతువునుండి వచ్చినదనియును ముందుచెప్పఁబోవు మఱికొన్ని యితరద్రావిడభాషల యొక్క నామములవలెనే యీపదమునకు మనుష్యుఁడు అని యర్థమనియుఁ గొందఱూహించుచున్నారు. తెలుఁగు వారిని గుఱించి సంస్కృతగ్రంథములయందు ఆంధ్రులు, అని వాడఁబడియున్నది. ఆంధ్రులు, అను నామధేయము మిక్కిలి ప్రాచీ

నములయిన బ్రాహ్మణములయందుఁగూడఁ గన్పట్టుచున్నది. తమిళమునఁ దెనుఁగువారిని వడుగులని వ్యవహరింతురు. ఈ శబ్దము వడ = ఉత్తరము, అనుశబ్దమునుండివచ్చినదని యూహ చేయనగును. తెలి+అగు, అనునది తెలుఁగు ఎట్లయినదో యట్లే వడ+అగు అనునది వడుగు అనియయినదని యూహింప నగును.

ఈభాష ఉత్తరసర్కారులు, దత్తమండలము, నెల్లూరు, చిత్తూరుజిల్లాలయందును, మదరాసు, హైదరాబాదు, మైసూరు మొదలగు ప్రదేశములయందుఁ గొందఱచేతను, హిందూ దేశమునందలి మఱికొన్ని భాగములకు వలసపోయినజనుల చేతను మాటాడఁబడుచున్నది. ప్రసిద్ధములగు తెనుఁగు జిల్లాల యందును, మైసూరు హైదరాబాదు మొదలగు ప్రదేశముల యందును నాంధ్రముమాటాడు జనసంఖ్య 18,675,586. అండమాను దీవులు, అస్సాము మొదలగు ప్రదేశములయందు మాటాడుజనులు 2,016,974 మంది.

ఆంధ్రసారస్వతమునందుఁ బ్రథమ గ్రంథము నన్నయభట్టుచే రచియింపఁబడిన భారతమనియు, నీభాషయందనేకములగు పద్యకావ్యములును గద్యకావ్యములును నున్నవనియును బాఠకు లెఱుంగుదురు గనుక విశేషించి యీవిషయము వ్రాయఁబడలేదు. భారత రచనాకాలము 1050. ఈభాషలో సుప్రసిద్ధ వ్యాకరణములు రెండు సంస్కృతమునందును, రెండు తెనుఁగునందును వ్రాయఁబడుటయేగాక యనేకములగు నితర లక్షణ గ్రంథములున్నవనుటయుఁ బాఠకులకుఁ దెల్లమేగదా.

ఈ భాషలో, (1) కోంటావు. (2) సాలేవారీ, (3) గోలరీ (4) బేరడీ, (5) నడరీ, (6) కామాశీ, యను మాండలిక భేదము లున్నవనియు నయ్యవి 1901 సం॥ జనాభా ప్రకారము 4704 జనులచే మాటాడబడుచున్నవనియును గ్రియరుసనుగారు వ్రాయుచున్నారు. గ్రియరుసనుగారు భాషా పరిశోధనచేయు కాలమున (1) కోమ్టావ్రు, (2) సాలేవారీ (3) గోలరీయను మాండలిక భేదముల జనసంఖ్యను బరీక్షించితిమనియు నాయా భాషలను మాటాడు జనసంఖ్య వరుసగా 3,867 ; 3,660 ; 25 అనియు వ్రాయుచున్నారు. వీరుదాహరించిన మాండలిక భేదములు వాడుకను బట్టి వచ్చినవే యనియు, విద్యాహీనుల నోటిలోఁబడి యట్లు విరూపమునందినవనియును గ్రింది యుదాహరణములచేఁ దెలియనగును. ఒకొక్క మాండలిక భేదమును గురించి చెప్పఁబడిన విషయముల నాభాషయందలి యొక మాదిరి వాక్యముతోఁ జేర్చియిచ్చుచున్నాను.

(1) కోమ్టావు. చండాలో వాడఁబడుచున్నది. 1901వ సం॥ జనాభా లెక్కలలో నీ భాషను 22 జనులు మాత్రము మాటాడునట్లు తెలుపఁబడినది. మాదిరి వాక్యములు.

"ఒక మనిషికి యిద్దరు పిల్లగాండ్లు వుండిరి; —తన సంపత్తు వాడుగొట్టినాఁడు.—వాడు అంతా వ్రెస్సినంక ఆ దేశములో లావు కరువు బడది. అందుకు వానికి కఠినము బడది."

(2) కామాశీ—దీనిని బొంబాయిలో నిటుక కాల్చువారు మాటాడుదురు.

మాదిరివాక్యములు.

"వక్క మనిషికి ఇద్దరు కొడకులు ఉండుండ్రి ... ... తోడ్యం (కొన్ని)దినాల్లుకాలే ఇంతట్లా చిన్నకొడకు తనది అంత హిస్సా (వంతు) జమాచేసి దూరందేశంకు యెల్లి పోయిండు."

3) దాసరిభాష. వీరు బిచ్చమెత్తిజీవించు జాతివారు.

మాదిరి వాక్యములు:—

"ఒక్కోడొక్కోడ్మనిసికి ఇద్దర్మగ పిలగాళు ఉండ్లి. వాళ్ళోన చిన్నాపిలగడు తన తండ్రికె అనె"

4) బేరాడీభాష. వీరు బెల్గాములోనున్న యనాగరక జాతివారు. మాదిరివాక్యములు.

"ఒకనికొక్కనికి. (ఒకానొక) గిరెస్తనక్ (గేస్తునికి) ఉద్రు (ఇద్దరు) పటి (మగ) బిడ్లు ఉద్రి. వర్దానాక (వారిలో) సణ్ణకొడక్ తన్ అయ్‌కే అండె (అనెను)" "రంగ అంత్ (రంగ డను) హులిగేడ్ (బొలుడు) గోవిందనక్ సెప్తాడ్." "మీ యవ్వ ఎంద్ హోడాయి. (మీ తల్లి యెక్కడికి పోయినది.")

5) వడరీభాష—బొంబాయిరాజధానిలో రాలుత్రవ్వు పాటకపు జనులు మాటాడుచున్నారు. మాదిరి:—

"అన్యా (అనెను)" "ఆయిండలేదు. (అయియుండ లేదు)" "కుడ్యస్కిన్య (కూడవేసికొనిన)" "తన బదకు (తన యాస్తి)" "సర్పుకిన్యా (సరిపుచ్చెను.)" "పందులు మేపస్యాంకి (మేపుటకు) సేనకు (చేనికి) అంస్య (అనిపెను.)"

ఈపయిఁ జెప్పఁబడిన భేదములన్నియును దెనుఁగు యొక్క యపభ్రంశములనియు నయ్యవి మాటాడువారి యజ్ఞత

చేతను స్వచ్ఛమగుభాషను మాటాడువారితోఁ జేరకుండుట చేతను వచ్చినవని చదివినవారికిఁ దెల్లముకాకపోవదు. ఒక్క మాతృభాష యెట్లు కాలక్రమమున వేర్వేఱు రూపములను బొంది మొదట మాండలికభేదములనంది తరువాత స్వతంత్ర భాషలుగా మారి పోవునో చూపుటకుఁ బయివాక్యములు మిక్కిలి యనువుగానుండునని యీయఁబడినవి.

IV. కన్నడము—ఈభాషను సుమారొక కోటిజనులు మాటాడుచున్నారు. ఇది మైసూరు, కోయముత్తూరు ప్రాంతములందు, సేలము, అనంతపురము, బళ్లారి జిల్లాలయందును మఱికొన్ని స్థలములయందుఁ గొంచెము కొంచెముగాను వాడఁబడుచున్నది. బెల్గాము, కొల్లాపురీ, హుబ్బళి, ధార్వాడ మొదలగు ప్రదేశములయందును గన్నడము మాటాడుదురు.

కన్నడ శబ్దముయొక్క వ్యుత్పత్తినిగుఱించి భిన్నాభిప్రాయములు గలవు. కన్నడ శబ్దము కర్ణాటశబ్ద భవమనియు గర్ణాటమనఁగా కర్ణే అటతీతి కర్ణాటః అను వ్యుత్పత్తి ననుసరించి చెవుల కింపయినదని యర్థమనియుఁ గొందఱ యభిప్రాయము. మఱి కొందఱు కర్నాటశబ్దము, కర్ + నాఁడు = నల్లనిదేశము, అను నర్థమున వెలసియుండెననియుఁ గన్నడ శబ్దము తజ్జన్యమనియు నభిప్రాయపడుచున్నారు. ఈ వ్యుత్పత్తికి మొదటదారి తీసినవారు డాక్టరు గుండెర్టుగారు. ప్రప్రథమమునఁ గర్ణాట శబ్దమాంధ్ర కర్ణాట భాషలకు రెండిటికిని గూడ వాడఁబడుచుండెననియుఁ గ్రమక్రమమున మారి యయ్యది యిప్పటి కర్ణాటభాషను మాత్రము బోధించు చున్నదనియు డాక్టరు కాల్డ్వెల్లుగారు, రైసుగారు కూడ నభిప్రాయపడు

చున్నారు. ఇందును తెనుఁగునందు వలెనే సంస్కృతసమాసములు కావ్యములలో లెక్కకు మిక్కిలి తత్సమములుగాఁ బ్రయోగింపఁబడియున్నవి.

కన్నడభాషయందును తెనుఁగు భాషయందువలెనే గొప్పదగు సారస్వతమున్నది. ఈ ప్రాచీన సారస్వత మంతయును హళగన్నడములో వ్రాయఁబడినది. ఇప్పుడు వ్యవహారములోనున్నది హొసగన్నడము. వాడుకలో హళగన్నడ పదములే మారి హొసగన్నడమయినవని చెప్పనగును. మూఁడవ శతాబ్దమున మాధవరాజను నాతఁడు 'దత్తసూత్ర వృత్తి' యనుగ్రంథమును వ్రాసెనని తెలియవచ్చుచున్నది. పంప, పొన్న రన్న యనుకవులు మూవురు పదియవ శతాబ్దముననుండి గొప్ప గ్రంథములనువ్రాసి కన్నడ కవులయందుఁ జాల గొప్పవారను ఖ్యాతిని గాంచిరి. పంపఁడను నాయన భారతము రచియించెను. పొన్నఁడు శాంతి పురాణమును రన్నఁడు గదా యుద్ధమును రచియించిరి. తరువాత ననేక కవులు తెనుఁగునందువలెనే ప్రబంధములను వ్రాసిరి. ఇందు కేశిరాజను నాతఁడు శబ్దమణి దర్పణమును (1160-1200), నాగవర్మ యను నాయన కర్ణాటకభాషా భూషణమును (వ్యాకరణములను) వ్రాసి కీర్తిఁగాంచిరి.

ఈభాషకును, (1) బడగ, (2) కురుంబ, (3) గోలరీ యనుపేళ్లు గలిగిన మూఁడు మాండలిక భేదములుగలవు.

V. తుళుభాష:—దీనిని నాగరక భాషలలో లెక్కించుటయా లేదాయను సంశయమును బుట్టించుటకు, దీనికి సారస్వతముగాని లిపిగాని లేకుండుట కారణమయ్యెను గాని యిప్పు

డాసంశయ ముండ నక్కఱలేదు. దక్షిణపు కనరా జిల్లా మధ్యభాగమున నీభాషను 5,35,210 మంది మాటాడు చున్నారు. చంద్రగిరి, కళ్యాణపురియను నదుల నడుమనుండు ప్రదేశమునందు మాత్రమే పూర్వకాలమున దీనికిఁ బ్రచార ముండినట్లు తెలియుచున్నది. ఈభాష వ్యాపించి యన్యులచేఁ గూడ నవలంబింపఁబడినట్లు నిదర్శనములులేవు. మధ్వజనులకు ముఖ్యయాత్రాస్థలమగు నుడిపియను పట్టణమున నీభాష బ్రాహ్మణులచే వాడఁబడుచున్నది. ఈ భాషకా ప్రదేశమే ముఖ్యస్థానమని చెప్పవచ్చును. చాలకాలము వఱకును నీ భాషలో గ్రంథములు రచియింపఁబడలేదు. బ్రాహ్మణులు కొన్ని కథలను దాటియాకులపయి మలయాళపు టక్షరములలో మాత్రను వ్రాసికొని యుండినట్లు తెలియవచ్చును. క్రైస్తవ మతబోధకు లీదేశమునకు 1834 వ సం॥ లో వచ్చి యీ భాషాగ్రంథములను గర్ణాటకపు టక్షరములలో నచ్చొత్తింప మొదలిడిరి. 1872 వ సం॥ బ్రిగెలు దొరగారు తుళువ్యాకరణ మును బ్రచురించిరి. 1886 వ సంవత్సరమున నొక యకారాది కోశముగూడఁ బ్రచురింపఁబడినది. తుళుభాష మలయాళపు టక్షరములతో వ్రాయఁబడి యుండుటచేతను, తుళుదేశమునకు సమీపమున మలయాళము ప్రచారములో నుండుటచేతను, దానిని మలయాళముయొక్క మాండలిక భేదముగా 'ఎల్లిస్' దొరగారు పరిగణించినట్లు తెలియవచ్చు చున్నది గాని యది సరిగాదనియును కన్నడమునకును కొడగుభాషకును దీనితో నెక్కుడు సంబంధమున్నట్లు కన్పించుచున్నదనియును కాల్డ్వెల్లు గారు వ్రాయుచున్నారు. తుళుశబ్దమునకు 'నెమ్మదియగు'

అని యర్థముగాన మొదటనది మాప్రజలను బోధించుచుండె నని యూహింపనగును.

VI. కొడగు లేక కూర్గుభాష:—ఈ భాష కూర్గు జిల్లాలో మాటాడఁబడుచున్నది. మలబారునకు మైసూరున కును, దక్షిణపు కనరాజిల్లాకును నడుమ పడమటి కనుమల మధ్య నీజిల్లాయుండుటచే నందలి భాషకు నితర భాషాసంపర్క మంతగానున్నట్లులేదు. ఈజనులసంఖ్య 39,191. కన్నడమున కును తుళుభాషకును దీనితో దగ్గఱయగు సంబంధము కలదు. మేజరుకోలు దొరగారీ భాషకొక వ్యాకరణమును రచియించిరి.

VII. తుద, లేక తొద భాష:—ఈ భాషను మాటాడు నాటవికులకు వాసస్థానము నీలగిరి పర్వతముల నడుమనున్న పీఠభూములు. వీరి జనసంఖ్య 805. వీరు సాధారణ ముగా గేదెలనుపెంచి వానినుండి జీవనము చేయుచుందురు. గేదెలకును దున్నలకును వారు ఇర్, ఎర్ అను పదముల నుపయోగింతురుగాని రెంటను పదములను సమష్టిని దెలుపుటకుఁ గూడ నుపయోగింతురు. ఎర్ అను నీ పదము తమిళములోని 'ఎరుమై' అనుదానికిని, కన్నడమునందలి 'ఎమ్మె' అను దానికి సంబంధించి యున్నది. తమిళమునందలి తొఱ అను పదమునకు మందయని యర్థము. తొఱవర్ అను పదమునుండి తొదవర్ అనియు దానినుండి తొద అనియును వచ్చియుండ వచ్చునని యును నూహింపఁబడినది గాని కాల్డ్వెల్లుగా రావ్యుత్పత్తి నంగీకరింప లేదు. ఈ జాతిజనుల యభ్యాసములను బట్టియు, వివాహపద్ధతులను బట్టియు మఱికొన్ని పోలికలను బట్టియు వీరు మలబారునుండి యా ప్రదేశమునకు వచ్చియుండ వచ్చు

నని యూహింపఁబడినది. ఈ భాష మలయాళమునకు సమీప మని కొందఱును, అరవమునకు సమీపమని మఱికొందఱును నభిప్రాయపడుచున్నారు. పోపుగారు ప్రాచీనకన్నడముతో దీని కెక్కువ సంబంధమని తలఁచుచున్నారు.

VIII. కోటభాష:—ఈ భాషను మాటాడు జనులును నీలగిరి పర్వతస్థానములలో తోద జనులకు పమీపముననే వసియించుచున్నారు. తోద జనులు తమ పాలను గాఁచుకొను టకును మజ్జిగఁ జేసికొనుటకును గావలసిన మట్టి పాత్రములను వీరే తయారుచేసి యిచ్చుచుందురు. వీరి జనసంఖ్య 1300. వీరు మనుష్య మాంసమును దిందురు గావున సాధారణముగా నెవ్వ రును వీరి కడకుఁ బోవుట కిష్టపడరని కాల్డ్వెల్లుగారు వ్రాయు చున్నారు. వీరిభాష కన్నడమున కెక్కువ సంబంధించినదని కాల్డ్వెల్లుగారి యూహ.

IX. గోండ్ లేక గోండీభాష:—ఉత్తరహిందూస్థాన మునందు వాడఁబడు ద్రావిడభాషలలో నెల్లముఖ్యమగునది యీగోండీభాషయే. ఈ భాషనాజాతివారు కోయిభాషయని కూడ వ్యవహరింతురు. దీనిని మాటాడువారు సుమారొక పదిలక్షలజనులు. గ్రియరుసనుగారి మొత్తపులెక్క 11,23,974 జనులు. 1891-వ సం॥ జనాభాలెక్కలను బట్టి ముప్పదిలక్షల గొండీజాతి జనులుండినను గోండీభాషమాటాడు వారు మాత్రము 13,79,580 జనులని తేలినది. దీనిని బట్టి పూర్వము గోండీ భాషను వాడు వారనేకులుండినను వారందఱును గాల క్రమమునఁ దమతమ నివాసస్థానములకు సమీపమున నున్న భాషలను నేర్చికొని మాతృభాషను విడిచిపెట్టుటచే నాభాష

యొక్క ప్రాచుర్యము తగ్గుచున్నదని తేలుచున్నది. ఈ గోండీ జాతివారు నివసించు స్థానములలో ముఖ్యమయినది మధ్య పరగణాలలో, వర్ధా, మండ్లా, బాలఘట్ ప్రదేశములకు నడుమ నున్నది. దీనినే గోండ్వనమని సంస్కృతమునఁ బలుకుదురు. అయినను ఈజాతి జనులు హిందూదేశములలోని యనేక పర్వత ప్రాంతములలో వసించుచున్నారు. ఈ భాషకు మాఱియా, గట్టు, కోయు, అను మూఁడు మాండలిక భేదము లున్నవి. కోలామీనాయకీ భాషలుగూడ గోండీ భాషకు సంబంధించినవే యయినను వానికిని దీనికిని గలుగు భేదము వానిని వేఱు భాషలని యూహించునంత బలముగానున్నది. ఈభాషలో గ్రంథములు లేవు గాని కొన్ని పాటలు మాత్ర మున్నవి. క్రైస్తవమత బోధకులీ పాటలను గొన్నిటిని దేవనాగరీ లిపిలోనచ్చొత్తించిరి. మదరాసు రాజధానిలో నున్న కొన్ని గోండీ పాటలను దెలుఁగక్షరములతో నచ్చువేసిరి. ఈభాషకు తెలుఁగు, కన్నడము, అరవము, అను భాషలతో చాల సంబంధముగలదు.

X. ఖోండ్ లేక, కు భాష:—దీనినే కూయి, లేక కంధీ, భాషయని చెప్పుదురు. ఈభాషను మాటలాడు జనులు 318,043 మంది ఈజాతివారి లెక్క 628,388 మంది యయ్యును ననేకులు తమ భాషను విడిచి యన్యభాషను స్వీకరించుటచే నిట్లు తగ్గియుండనగుననియు, జనాభా లెక్కలలోఁ గొంతతప్పుండ వచ్చుననియు గూడ నూహింపఁ బడుచున్నది. ఈ జాతివారు ఓఢ్రదేశమునకు సంబంధించిన యరణ్యప్రదేశములలో నివసించుచున్నారు. గంజాము విశాఖపట్టణము

జిల్లాలలోనున్న మన్యపు ప్రదేశములలోగూడ వీరు కాపురము చేయుచున్నారు. వీరిని తెనుఁగువారు కోఁదులని పిలుతురు. ఇందును గొన్ని మాండలికభేదములు కలవు గాని యాభేదము లంతగా పాటింపఁదగినవికావు. ఈ భాషయందును గ్రంథములుగాని లిపిగాని లేవు. క్రైస్తవ మతబోధకులు తమ బైబిలు నీభాషలోనికి బరివర్తించి దాని నోఢ్రపు టక్షరములలో ముద్రించిరి. లింగము లక్ష్మాజీపంతులుగా రీభాషకు వ్యాకరణము నాంగ్లములో వ్రాసిరి. దీనికిని తెలుఁగు మొదలగు ద్రావిడభాషలకును పోలికలు గలవు.

XI. మాలెర్ భాష:—దీనినే రాజమహాలు భాషయనిగాని మాల్తోభాషయని గాని చెప్పుదురు. ఈభాషనుగుఱించి కాల్డ్వెల్లుగారి పుస్తకమునందు విశేషముగా వ్రాయఁబడలేదు. సొంథాల్ పరగణాలలోని రాజమహాలు కొండలలో వీరు నివసించుచున్నారు. వీరి జనసంఖ్యను గుఱించి జనాభా లెక్కలలో కొన్ని భేదములు వచ్చుటచే నిదమిత్థమని చెప్పుటకు వీలులేదు. సొంథాల్ పరగణాలలో నున్నవారు 59476 మందియనియు తక్కిన ప్రదేశములలో నివసించు వారితో గలిసి మొత్తపుసంఖ్య 60,777 అనియును గ్రియరుసనుగారు తెలుపుచున్నారు. మాలెర్ అనుపదమునకు 'మలెర్' అను రూపముగూడ గలదని తెలియుచున్నది. మాలెర్ అనఁగా మాల్తోభాషలో మనుష్యులని యర్థమనియు మొదట నాపదము జాతిని దెలుపునది యయ్యుఁ దరువాత నాభాషకే, పేరుగావాడఁబడుచున్నదనియును గొందఱియూహ. వీరు కొండవారు గావుననుమల, యనఁగా కొండగావునను దానినుండి పైపదము వచ్చి

యుండునని గ్రియరుసనుగారి యూహ. ఈ భాషకును సార స్వతము లేదు గాని క్రైస్తవమతబోధకులు మాత్రము తమ గ్రంథముల నీభాషలోనికి మార్చి రోమనుభాష యక్షర ములతో ముద్రించి కొనిరి. ఈమాల్తోభాషకును కురుఖ్ భాష కును జాల సంబంధము కనుపట్టుచున్నది. దీనికి నితరద్రావిడ భాషలతోఁ గొంత సంబంధము కనుపట్టుచున్నది. అయినను నార్యభాషల సంపర్కమును జాలనఱకుఁ గలదు.

XII. ఓరయాను భాష:—దీనినే కురుఖ్ భాషయని కూడ వ్యవహరింతురు. ఈభాషను వాడు జనులు సుమారు 50 లక్షల మంది యుందురు. మొదట వీరు కర్ణాటదేశమున నుండిరనియుఁ దఱువాత బిహారు దేశములోని సోఁనది దగ్గఱ కేగి యచ్చటనే వసియింపఁ జొచ్చిరనియును,దరువాత మహమ్మ దీయులచేఁ దఱుమఁబడి యొకగుంపు గంగానదీ మార్గమును బట్టిపోయి రాజమహలు కొండలలో నివసింపఁ జొచ్చిరనియును జిక్కినవారు సోఁనదీతీరముననే మఱి కొంతదూరము పోయి చోటానాగపురపు పీఠభూమిలో నివసింపఁ జొచ్చిరనియు వారి వలననే తెలియవచ్చుచున్నది. ఈ తెగవారికి కురుఖ్ తెగయనియు భాషకు కురుఖ్ కథాయనియుఁ జెల్లు.

ఈ భాషయొక్క నామధేయమును గుఱించి డాక్టరు హాఁదొరగారిట్లు వ్రాయుచున్నారు. కోలారియను భాష లోని 'హోరో' (మనుష్యుఁడు) అను పదముతోఁగాని ద్రావిడ సితియను పదముగు కురుక్ = అఱచువాఁడు అను పదము తోఁగాని దీనిని సరిపోల్చి వానిలో దేనితోనయిన నిది యభిన్న మయి యుండవచ్చునని యూహింపనగును. ఈ పయి యూహ

లను డాక్టరు గ్రియరుసనుగా రంగీకరింపమనియు, నెవ్వ రయినను తమ్ము ‘మాటాడువారు’ అని పిలుచుకొనుట యుక్తముగాని ‘యఱచువారు’, అనుకొనుట స్వాభావికము గాదనియుఁ జెప్పుచున్నారు. ఈ తెగవారినే, ఒరయాఁ. ఒరామో. ఉరామో, ఉరంగ్, అవురంగ్, అను పేళ్లతోఁగూడ నుదాహరించుటయుఁగలదు.

ఈభాష మాటాడువారు ముండా జాతివారితోఁ గలసి సాధారణముగా జీవించుచుండుటచేఁ జాల సారులు లెక్కలలో వీరిని ముండాజాతి జనులుగా లెక్కించుచుండుటయుఁగూడ జరుగుచున్నది. ఈ జాతివారిలోఁ జాలమంది చోటా నాగ పురపు పీఠభూములలో నివసించుచున్నారు. ఆ ప్రదేశము నందలి రంచి జిల్లాలో మొత్తములో $\frac{3}{8}$ వంతు మంది నివసించు చున్నారు. దగ్గఱ జిల్లాలలోఁగూడ ననేకులున్నారు. ఈభాష యందు ముఖ్యములగు మాండలిక భేదములు లేవని చెప్ప నగును. ఈభాషను మాటాడు జనుల మొత్తపుసంఖ్య 503,980 అని లెక్కవేయఁబడినది.

కురుఖ్ భాషలో గ్రంథములు లేవు క్రైస్తవమత బోధ కులు మతగ్రంథముల నీభాషలోనికిఁ బరివర్తించి దేవనాగరపు టక్షరములలో ముద్రించిరి. తక్కిన ద్రావిడభాషలకును దీని కిని సామ్యము లనేకములుగలవు.

XIII. కోలామి, నాయికీ మొదలగునవి :—తూర్పు బీరారు నందును మధ్యపరగణాలలోని వర్ధా జిల్లాలోను కోలాములను నొకానొక యాటవిక జాతివారు నివసించుచున్నారు. వీరి మొత్తపు జనసంఖ్య 23,100. వీరిని సాధారణముగా గోండ్

జాతి వారినిగా లెక్కింతురుగాని యాసంబంధము నొప్పు కొనుటయందు వీరి కిష్టమున్నట్లు గన్పట్టదు. వీనికిని దెలుఁగు నకును గన్నడమునకును గొన్ని విషయములలో పోలికలు కలవు.

నాయికీభాష యనునది చండాయందుండు దార్వే గోండులు మాటాడుచున్నారు. వీరి జనసంఖ్య 195. ఈభాష కొంచె మించు మించుగా నశించినదని చెప్పనగును. ఈభాష కును కోలామీ భాషకును ననేకములగు సామ్యములుగలవు. గోండీభాషకును దీనికిని ననేక విషయములలో భేదములు గలవు. ఈ భాషలకును సారస్వతమును లిపియును లేవు.

XIV. బ్రాహూయీభాష :— ఈభాష మాటాడువారు బెలూచి స్థానమునందున్న సరవణ్, ఝలవణ్ మండలములలో నున్నారు. బొంబాయి రాజధానిలోఁగూడ సుమారు నలువది వేలమంది జనులున్నట్లు గ్రియరుసనుగారి లెక్కలనుండి తేలు చున్నది. బెలూచిస్థానముయొక్క తూర్పుభాగమునందలి పర్వతప్రాంతములలోను సింధునకు సమీపముననున్న జిల్లాల లోను వీరు ముఖ్యముగా నివసించుచున్నారు. మొదటి నుండియు బెలూచి స్థానముననె వసియించువారమని వీరు చెప్పుకొనుచున్నారు. ఈభాషలో మాండలిక భేదములు లేవు. వీరి జనసంఖ్య గ్రియరుసనుగారి సర్వేప్రకారము బెలూచి స్థానమునందు 129,500. బొంబాయి రాజధానియందుండు వారు 36,000. మొత్తము 165,500 మంది.

ఈభాషకును ద్రావిడ భాషలకును గొంత సంబంధ మున్నదని పరిశోధనవలనఁ దేలినను దక్కిన భాషలయందలి

భాగములు దీనియం దెక్కువగా నుండుటచే దీనిని ద్రావిడ భాషల పట్టికలోఁ జేర్పఁబడలేదని కాల్డ్వెల్లుగారు చెప్పియున్నారు. గ్రియరుసనుగారు మాత్రము దీనిని ద్రావిడభాషగానే యంగీకరించి తమ గ్రంథమున లెక్కించుచున్నారు.

[ఈపయి చరిత్రముల నిచ్చుటలో ముఖ్యముగా గ్రియరుసనుగారి లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా, అను గ్రంథమును కాల్డ్వెల్లుగారి గ్రంథమును నుపకరించినవి. అవిగాక మఱికొన్ని గ్రంథములను బరీక్షించి యక్కడక్కడ విశేషములను జేర్చితిని. జనాభాలెక్కలకు గ్రియరుసనుగారి సంఖ్యలే ప్రమాణము. వారి సర్వేలో భాషల లెక్కలు తేల్పఁబడ నప్పుడు 1901 వ సంవత్సరమునందలి జనాభా లెక్కలలోని సంఖ్య లీయఁబడినవి. ఈరెండు సంఖ్యలకు సాధారణముగా భేదములు గలవు.]

ద్రావిడభాషలకుఁగల పరస్పర సంబంధమేమి :—ఈ వఱకు ద్రావిడభాషలని నిర్ణయింపఁబడిన భాషలను గుఱించి కొంచెము కొంచెముగా వ్రాసియుంటిమి. ఇఁక వీనికిఁగల పరస్పరసంబంధమేమి యను విషయమును జర్చింపవలయును. ఈపయి నీయంబడిన భాషలలో నొక్కొక భాషనుగుఱించి చర్చించు నప్పుడా యాభాషలయొక్క మాండలిక భేదములను గుఱించికూడఁ గొంచెము కొంచెము వ్రాయఁబడినది. ఈ మాండలిక భేదము లేర్పడుటకుఁ గారణ మా యా మండలములలోనున్న జనులు సాధారణముగాఁ గలియకుండుట యే యని చెప్పనగును. భాషయనునది యభిప్రాయప్రకటనమునకు సాధనము.మూఁగవారు సంజ్ఞలచేఁ దమయభిప్రాయముల నొకరికి వ్యక్తీకరించునప్పుడు గూడ నొకవిధమగు భాషనే వాడుచున్నారని చెప్పనగును. అట్టి మార్గములన్నిటికంటెను ధ్వని

మూలకమగు నభిప్రాయ ప్రకటన మత్యంత సౌలభ్యముతోఁ గూడుకొని యున్నదగుటచేతను నాగరకతా స్ఫోరకమగుటచే తను నీనాడువ్యవహారములో భాషయను పేరితో వెలయుచున్నది. ఇట్టి యభిప్రాయములకు మాటలు సంకేతములగుటచే నా సంకేతములు జనసమాదరణమును బడయవలసియుండును. మానవులొక సంఘముగానుండి సాంఘిక జీవనమునందలి లాభములను సంపూర్ణముగాఁ బడయుటకు సర్వజనాంగీకృత మయి సాంకేతికసమష్టిరూపమగు భాషయే ముఖ్యసాధనము గదా. ఇట్టిభాష యెంతమందిజనులచే మాటాడంబడి యెంతటి ప్రచారములోనున్న నంతటిలాభమును నాగరకితాభివృద్ధియుఁ గలుగకమానదు. అనేకులు మేధావులు చేసిన పరిశ్రమను భాషయందు నిక్షేపించి ముందువచ్చు మానవసంఘమునకుఁ బిత్రార్జితమగు ధనమువలెనే వారొసంగి పోవుచున్నారు. కావుననే యేభాష నాగరకులయందు విశాలవ్యాప్తిఁజెంది యుండునో యాభాషయందు విజ్ఞానమెక్కువగా లభియించును. కాని మానవస్వభావమునందు సంఘీభావమెట్లుస్వాభావికమో,యట్లే ప్రత్యేకజీవితము నభిలషించుటయును స్వాభావికమని చెప్పక తప్పదు. కావుననే ప్రపంచమునంతటికి నొక్కభాష కలుగక జాతిజాతికిని దేశదేశమునకును భాషలు వేఱుగానున్నవి. ఇట్టి భాషలు వేఱగుటకుఁగల కారణములను గొన్నిటిని బరిశీలించి నచో నయ్యవి, మనద్రావిడభాషలకుఁగల పరస్పర సంబంధ మునుబోధపఱచుకొనుటలో నుపయోగపడునని చెప్పవచ్చును.

భాష యందఱిసొమ్మనుటచే నందఱును దానినుపయో గించుట కవకాశమున్నది. గ్రామమునందలి రథ్యలలో నడ

చుటకందఱకును నధికారముండుటవలన నొక్కొక్కవ్యక్తియుఁ దనకు వీలయిన మంచినిగాని చెడుగునుగాని యార్థ్యకుఁ జేర్చు చునే యుండుటను మనము చూచియున్నాము. అట్లే భాష యందును బ్రతిమానవుఁడు తనయొక్క వ్యక్తిత్వమును (Individuality) జూపించుటకు నవకాశములు కన్పట్టుచున్నవి. జీవుల యంగముల సాహాయ్యమున నుచ్చరింపఁబడిన యర్థయుక్త మగు శబ్దసమూహము భాషగావునను నాయాయంగముల యొక్క శక్తి యనేకములగు కారణములచే స్వాభావికముగా నొక్కనికంటె వేఱొక్కనియందు భిన్నముగానుండుటచేతను భాషాపరిణామమునందు రథ్యాపరిణామముకంటెఁ గొన్ని విశే షములున్నవి.

ఒక్క దేశముననుండు నల్పసంఖ్యాకులగు జనులొక్క భాషనే మాటాడుచుండు వారయ్యును గాలక్రమమున వారి సంఖ్య పెరిగిపోఁగాఁ గొన్ని దేశములకు వలసపోవలసిన వార గుటచేతను నాతరువాత రాకపోకలు గలుగకుండుటచేతను నా భాషమారుట సంభవించును. భాషలోనిరూపములు మారుటకు ముఖ్యకారణములు.

(1) ఒక దేశమునుండి యింకొక దేశమునకు వలసపోయి తిరిగి తమపూర్వులతోఁ గలియకుండుటచే వారు వాడుపద ములు మారుచుండును.

(2) కాలపరిణామముచే దేశమునందలి శీతోష్ణస్థితులు మారుటచే మాటలనుచ్చరించు ముఖయంత్ర సౌకర్యము కొఱకు పదరూపములు మారుచుండును.

(3) ఒకొక్కభాష కొకొక్కకాలమున నొక్క సంస్కర్తగాని యొక సంస్కర్తల సంఘముగాని బయలుదేరి తమ పాండిత్యముచేతను, దమ మేధావిశేషముచేతను దక్కిన వారి యభిప్రాయములనుమార్చి భాషను గొంతమట్టునకు మారునట్లుగఁ జేయుటయుఁ గలదు.

(4) అన్యభాషా సంపర్కముచే భాషలునిరంతరముగా మారుట జరుగుచుండును.

(5) భాషాపరిణామమునకుఁ బ్రతిమానవుడును నప్రయత్నముగాఁ గొంత సహాయపడుచునే యుండును.

ఈ పయికారణములలోఁ గొన్నిటికి ముఖ్యములగు నుదాహరణములు తెనుఁగు భాషకుఁజేరిన మాండలిక భేదములనుండి కనిపెట్టనగును. కామాఠీ మొదలగు భాషాభేదములుః తెనుఁగునుండి పుట్టినవే యనుట నిశ్చయము గదా! బొంబాయికిఁ గూలిపనికయి పోయిన జనులు తమతోఁ దమ కాలపు దెనుఁగునుగూడ గ్రహించి, పోయియుందు రనుట నిర్వివాదము. తెనుఁగున 'వెళ్లిపోయినాఁడు' అను పదమె కామాఠీయందలి 'యెల్లిపోయిందు' అను దానికి మాతృకగదా! 'ఉండిరి' అను పదము దాసరిభాషలో 'ఉండ్లి' అని మారుట పయి యుదాహరణములనుండి కనుఁగొన నగును. బేరాడీభాష యందలి 'ఉద్రు' శబ్దము 'ఇద్దఱు' శబ్దభవమనుటలో విప్రతిపత్తి యుండదు గదా. వడరీభాషలోని 'అన్యా' అను పదమునకు 'అనెను' అనునది మాతృకయనుట నిర్వివాదము. వీరు తీసికొని పోయిన తెలుఁగు కొన్ని సంవత్సరములలో నిట్లు పరిణామమును బొందఁగా మఱికొన్నినందల సంవత్సరములలో

నిఁక నెట్టి మార్పును జెందఁగలదో పాఠకులే యూహించుకొనఁ గలరు. తెనుఁగుయొక్క యపభ్రంశమగు నియ్యది యప్పుడు స్వతంత్రభాషగా లెక్కింపఁబడుననుట యనుభవదూరము కానేరదు. తెనుఁగుయొక్క యపభ్రంశములగు పయిభాషా భేదములన్నియు వేర్వేఱుభాషలుగాఁ బెరుఁగఁగా నేపండితుఁడో వానికొక వ్యాకరణమును వ్రాసినపిమ్మట నందలి జనులు స్వీయభావ ప్రకటనముచే సారస్వతమును గ్రమక్రమముగాఁ గల్పించుకొనినప్పుడు వారి నాగరక జనసంఖ్యయుఁగాలవశమున నభివృద్ధియయ్యెనేని నూఱుసంవత్సరములక్రింద గగన కుసుమంబగు భాష మఱికొన్ని వందలసంవత్సరములకు భాషారాజమయి విలసిల్లుట సంభవింపవచ్చుననుటలో మానవుని యనుభవమునకు దూరము లేదని చెప్పవచ్చును. ప్రపంచమునందలి భాషలునశించుటయుఁ గ్రొత్తభాష లుత్పన్నములగుటయు నిట్లే జరుగుచుండును. అనేక సామ్రాజ్యములు ప్రభవించుటయు క్షీణించుటయు, మతములు ప్రభవించుటయు నశియించుటయు, నీసందర్భమున స్మరియింపనగును. కొన్నివందల సంవత్సరములక్రింద విశాలముగా హిందూదేశమున వ్యవహరింపఁబడుచు మానవుల దైనిక వ్యవహారములకుఁ బట్టుగొమ్మయగు సంస్కృతము నేడు గ్రంథములును పండితవదనమ్ములును శరణ్యములుగాఁగలదగుట చూచుచున్నాము గదా.

మన ద్రావిడభాషలును బయి ప్రకారముననే పుట్టి యభివృద్ధినందెననుటను బయివాదమునుబట్టి యూహించికొనన గును. పయిద్రావిడభాషలన్నిటిని శాస్త్రజ్ఞులు పరీక్షించి వానిస్వభావమును గుర్తించి యొక్క మాతృభాషయగు

ద్రావిడభాషనుండి పుట్టియున్నవని యూహించియున్నారు. అట్టి ప్రాచీనద్రావిడభాష యుండెడిదనుట పయిభాషల సామ్యము లనుబట్టి యూహింపఁబడవలసినదే. అట్టి భాష వ్యవహారమున నుండినట్లు నిరూపించుట కితరాధారములు లేవు. అట్లొక్క భాషనుండి పుట్టిన వనుటచేతనే వీనినన్నిటిని నేకకుటుంబముగా వ్యవహరించుటయును జరిగినది. ప్రథమప్రకరణమున నుదాహరింపఁబడిన భాషాకుటుంబములును నిట్టి పరిశోధనమువలన నేర్పఱుపఁబడినవే గాని వేఱుకాదని పాఠకులు దీనిఁబట్టి గ్రహియింపనగును. ఆంధ్రభాషలో నన్నయభట్టునకుఁ బూర్వము పేర్కొనందగిన పద్యకావ్యములుగాని గద్యకావ్యములుగాని యుండలేదనుట తెల్లముగ దా. పోయిన 900 సం॥ లోనీ సారస్వతమెట్లభివృద్ధిపొంది భాష యెట్లు పరిణామమును జెందినదో భారతాదిగ్రంథములను బరీక్షించినఁ దెల్లమగును. భాషయందు మార్పులు ప్రవేశించుటకుఁ గారణము లనేకములు ముందు దెల్పియుంటిమి. నాగరకత యభివృద్ధిపొంది ముద్రణయంత్రములునెలకొని, ప్రామాణికభాష వెలసి, సారస్వతమభివృద్ధిఁజెంది, దేశదేశముల నుండుజనులకు రాకపోకలకును సంబంధ బాంధవ్యములు చేసికొనుటకును నవీనప్రయాణ సౌకర్యము లేర్పడి, సంఘమున్నత స్థితికివచ్చుచున్నప్పుడు భాషాపరిణతికిఁగల వేగము చాలవఱకు మందగించును. పయిఁజెప్పఁబడిన లక్షణములు లేక భాష ప్రాథమికావస్థయందున్నప్పుడు ఝురీవేగమున మారుచుండుననుట యుక్తిదూరముకాదు. నన్నయభట్టునకు వేయిసంవత్సరములకు ముందుండిన భాష మన

భాషకంటె ననేకవిధముల విజాతీయముగా నుండెననుటలో వింతలేదు గదా!

మొట్టమొదట ద్రావిడభాష మాటాడుజను లల్ప సంఖ్యాకులయి యుండిరనియును వారి జనసంఖ్య పెరుగుచు నాగరకత యభివృద్ధి యగుచురాఁగా వారు రెండు భాగ ములుగాఁ జీలిరనియు నూహింపవచ్చును. అందు దక్షిణపు తెగనుండి తమిళమలయాళకర్ణాటకములును నుత్తరపు దెగ నుండి యాంధ్రమును గలిగెనని మనమూహింపనగును. మల యాళము తమిళమునుండి విడువడిన యొక యర్వాచీన శాఖ యని ప్రాచీనపు మలయాళముయొక్క స్వభావమును దమిళ ముతోఁ బోల్చి చూచినఁ దేలఁగలదు. కన్నడమును దెలుఁగును ననేక సంవత్సరములకు ముందొక్క భాషగనేయుండి తరువాత వేఱుపడిన వనియును నుత్తరపు శాఖనుండి యీ రెండునువచ్చి నవనియును గన్నడము తమిళమునకు దగ్గఱగా నుండుటచే దాని పోలికలు తెలుగుకంటె నందెక్కువగా నున్నవనియును గొందఱ అూహించుచున్నారు.

తక్కిన మూఁడు భాషలకంటెను ముందే తెలుఁగు చీలిన దనుటకుఁ గొన్ని యాధారములు కలవు. ఇందలి పదముల యజంతతయు, వర్ణవ్యత్యాసమున గలిగిన రెండు, గోరు, మొ॥ పదముల యునికియు, 'ఉ' యను సర్వనామముయొక్క రూపము లిందు భ్రష్టములగుటయు, ఉత్తమ పురుషైక వచనమునందు 'ఆ' అను దానికి బదులుగా 'ఏ' యుండుటయు, మధ్యమ పురుషమున 'నీ' యను దానికి బదులుగా 'ఈ' అని యుండుటయు, ఱకారము భ్రష్టమగుటయు, 'గళ్' అను బహు

వచన ప్రత్యయమునకు బదులుగా 'లు' అని వాడఁబడుటయు, ప్రేరణార్థకమగు 'ఇంచుక్' తక్కిన భాషలయందలి ప్రేరణార్థకములకంటె రూప వైషమ్యమును గలిగియుండుటయు, మూల భాషనుండి వచ్చి మార్పు లేకయే తమిళమునందు నిలిచి యున్న 'తిరి' మొ॥ ధాతువులు గువర్ణక సంయోగముననే యిందు వాడఁబడుటయు, గసడవా దేశ బాహుళ్యమును, మఱి కొన్ని మార్పులును గలిసి, తెలుఁగునకు దక్కిన మూఁడు భాషలకంటెఁగల పృథక్స్వభావమును దానివలన మూలభాషనుండి తక్కినభాషలకంటె నియ్యది ముందుగాఁ జీలినదనియు నూహించుటకు బలమగు నాధారములుగాఁ గన్పట్టుచున్నవని మాయభిప్రాయము.

ప్రాచీనపు గన్నడమున హలంతశబ్దములు చాలనుండుటయుఁ దమిళశబ్దము లత్యల్పములగు మార్పులతో నందుఁ గన్పట్టుచుండుటయుఁ బయి యభిప్రాయమును దృఢపఱుచుచున్నది. మిగిలిన కొడఁగు తుళు మొదలగు ద్రావిడ భాషలను నిప్డే యల్పసంఖ్యాకులగు జనులు పర్వత ప్రదేశములలోనో యితరజాతి సంపర్కములు విశేషముగా లేని స్థలములలోనో యుండిపోవుటచేత నీ కాలమునకు భాషాంతరములుగా మారి యుండుననుట సిద్ధము.

ఇఁకఁబయిభాషల నన్నిటిని నొక్క కుటుంబముగా నిర్ణయించుటకుఁ గల కారణములను వానికిఁ గల యుదాహరణములను దిఙ్మాత్రము పరిశీలింతము.

(1) ద్రావిడ భాషాపదములను బరీక్షించిన యెడల నాయాపదములకుఁగల మూలరూపము లనేకపదముల విషయ

| తెలుఁగు | తమిళము | మలయాళము | | కన్నడము | తుళు | కొడగు |
|---|---|---|---|---|---|---|
| రా | వా | వారిగ, వా, | | బా | | |
| నిలు | నిల్లు | నిల్లు నిల్ | | నిల్లు | | |
| తిను | తిన్ను | తిన్ను | | తిన్ను | | |
| గోండీ | కూయి | కోట | కురుఖ్ | తొద | మాలెర్, మాల్తో | బ్రాహూయీ |
| వరా | బాము | | బరా | | బర | బర్ |
| నిల్లా | నిల్ము | | ఇజా | | ఇలా | సల |
| తిన్ | తిన్ము | | * మోఖా | | * లాపెత్ మెకెత్ | * కుర్ |

* ఇవి మెక్కు ధాతువునకు సంబంధించినవేమో యని తోచుచున్నది.

ములలో నభిన్నములగుట ముఖ్యమగు కారణమని చెప్ప వచ్చును. పదస్వరూపమునందుఁ గలిగిన మార్పు లొకపద్ధతిని రూపసిద్ధికొఱకో, యుచ్చారణ సౌలభ్యముకొఱకో మఱి యేకారణముననో వచ్చినవిగా మనము గుర్తింపనగును.

ప్రక్క నుదాహరించిన క్రియారూపములయందు మూల రూపము లొక్కటిగానే యున్నవనుట చూచువారికిఁ దెల్లము గదా. ఇట్లే పయిభాషలలో నికితర భాషలనుండి వచ్చిన శబ్ద ములుగాక, మిగిలిన దేశ్యశబ్దములను బరీక్షించినయెడల సాధా రణముగా వాడు క్రియలు, సంబంధ వాచకములు, అనుదినము నుపయోగించు నుపకరణవాచకములు, సంఖ్యావాచకములు, సర్వనామములు, మొదలగునవి, భాషలకుఁ బునాది యనియును బ్రాచీనములనియును జెప్పఁదగిన పదము లన్నియును నభిన్న మూలరూపముల నుండియేవచ్చెననుట నిస్సంశయముగాఁ దేలఁగలదు. ఈ పయివాని కన్నిటికిని నుదాహరణములు ముందు మందుచేయఁ బోవువిచారణలో నక్కడక్కడఁ గొన్ని లభియింపఁగలవు.

(2) నామవాచకముల యొక్క లింగభేదమును బరిశీ లించునపుడు ద్రావిడ భాషలయందంతటను విభాగ మొక్క రీతినే యున్నదని చెప్పనగును. తమిళమునందు ఉత్తమజాతి (ఉయర్ దిణై) జాతిహీనము (అల్ దిణై.) అని రెండు తెగ లుగా నామములు విభజింపఁబడియున్నవి. తెనుఁగున, మహ త్తులు, అమహత్తులు, అని యేర్పఱుపఁబడియున్నవి. బహు వచనమున స్త్రీపుంస సామాన్య రూపములు వాడఁబడు చున్నవి.

ఈ పద్ధతిని విభజించుట యీ భాషలకొక ప్రత్యేక లక్షణమయి వీని నొక కుటుంబముగాఁ దెలుపుచున్నది.

(3) ఈ భాషలయందు సంస్కృతాది ప్రాచీన భాషల వలెఁగాక యేకవచనము బహువచనము, అను రెండు వచనములే వాడఁబడుచున్నవి.

(4) ఈ భాషల యందలి విభక్తిరూపము లన్నియుఁ గొన్ని ప్రత్యయములను బదములకుఁదుదిని జేర్చుటచేఁ గలుగుచున్నవి.ఆప్రత్యయములలోఁ గొన్ని ప్రప్రథమమున స్వాతంత్ర శబ్దములుగా నుండియు వాడుకలో తమ స్వతంత్రప్రయోగ యోగ్యతనుండి భ్రష్టములయి యిప్పుడు విభక్తిరూపములుగానే పరిగణింపఁబడుచున్నవి. ఈ రూపములు సాధారణముగా నొక్కయంగముపయిఁ జేర్పఁబడుచుండును. ఇది సామాన్యముగా షష్ఠీరూపము.

(5) ద్రావిడ భాషలయందలి విశేషణములకు సంస్కృత భాషవలె ప్రత్యయయోజనాయోగ్యత లేదు. అనఁగా సంస్కృత విశేషణములకుఁ దమ తమ విశేష్యములకు వలెనే ప్రత్యయములు చేరుటగలదు. ఇందట్లు లేదని యర్థము. ఉ॥ అప్రతిహతేన రామబాణేన హతః॥ అప్రతిహతమగు రామబాణముచేఁ జంపఁబడెను.

(6) ద్రావిడభాషలలో నిండో యూరపియన్ భాషల యందున్నట్లు (Relative Pronouns) సంబంధబోధక సర్వనామములు లేవు. వీనికి బదులుగాఁ క్రియాజన్య విశేషణములే వాడఁబడును. ఉ॥ వచ్చినవాఁడు; య ఆగతః సః, (He who is come).

(7) సర్వనామములయొక్క సంక్షేపరూపములే తిజ్విభక్తులుగా నీభాషలలో నుపయోగింపఁబడుచున్నవి. ఉ॥ వత్తు (ను); వత్తు (ము),

(8) ఈ భాషలలో కాలములు మూఁడే యుపయోగింపఁబడుచున్నవి. సంస్కృతమునందువలె దశవిధ లకారములుగాని ఆంగ్లమునందువలెఁ బండ్రెండు కాలభేదములు (Tense forms) గాని యిందు లేవు.

(9) స్వతంత్రమగు కర్మార్థక ప్రయోగమును దానికి వేఱురూపములును వాని కొక ప్రక్రియయును సంస్కృతమునందువలె నిందు లేదు. పడు ధాతువు చేర్చుటచేత నే యాప్రయోగమును సిద్ధము. ఉ॥ సం॥ కరోతి॥ క్రియతే. చేయఁబడుచున్నది.

(10) నఞర్థకమగు న, గాని, నొ, లేక నాట్ అనిగాని చేర్చుటవలన గాక యిందలి వ్యతిరేకార్థక రూపములు తిజ్విభక్తులకు ముందు చేర్పఁబడు వర్ణవిశేషముచే తెలుపఁబడును. ఉ॥ చేయు+అ+ము=చేయము.

ఇట్లు ద్రావిడ భాషల నొక కుటుంబముగా గ్రహియించుటకుఁ గలిగిన పోలికలను బయిని వివరించితిమి. ఈవిషయములనే నోదాహరణములతోఁ దిరిగి మఱియొక ప్రకరణమున విమర్శింతుముగాన నిచ్చట నింతటితో విరమించితిమి.



## III. వీని యుత్పత్తిని గుఱించి ప్రాచీను లేమి చెప్పిరి.

ద్రావిడభాషల నామములను వానినన్నిటి నొక్క కుటుంబమునకుఁ జేరినవానిగా నూహించుటకుఁ దగిన కారణములను దిఙ్మాత్రముగాఁ బ్రదర్శించి వానియుత్పత్తిని గుఱించి ప్రాచీనులేమి చెప్పిరను విషయమును విమర్శింతుము. ప్రాచీనులనఁగా నీప్రకరణమున ద్రావిడభాషల కాయాదేశములందు వ్యాకరణములు రచియించిన దేశీయ పండితులనియు నవీనులనఁగాఁ బాశ్చాత్య విజ్ఞానము కలిగి దేశభాషలను బఠించి తరతమ భావముతోఁ భాషాశాస్త్ర పద్ధతుల ననుసరించి భాషలను బరీక్షించిన కాల్డ్వెల్లు మొదలగు వారనియు వివక్షితము. ఇఁక ద్రావిడభాషలను గుఱించి సరియగు పరిశ్రమ మొనరించి ప్రామాణికమగు గ్రంథములను వ్రాసినవారు దేశీయులలోఁ బాశ్చాత్య విద్యాసంపన్నులలో నవీనులు లేరని మాయభిప్రాయమును దెల్పుటకుఁ జింతిల్లుచున్నను నందల్ప ప్రయత్నములఁ జేసి భాషాశాస్త్ర గ్రంథముల రచియించితి మనిపించుకొనిన వారి గ్రంథములును, వారి పరిశ్రమలును నవీనుల తెగయందే విమర్శింపఁబడును.

ఇఁక నొక్కొక్క ద్రావిడ భాషకును వ్యాకరణముల రచియించిన వారియభిప్రాయములను వివరించుటలో నాంధ్రభాషా

వ్యాకర్తల యభిప్రాయములను దొలుదొల్త విమర్శించి తక్కినవానికిఁ దరువాతఁ దొరకొనియెదము.

ఆంధ్రమునందుఁ బ్రాచీన మనంబడు ప్రామాణిక వ్యాకరణము నన్నయభట్ట కృతమగు నాంధ్రశబ్ద చింతామణి. దాని శేషగ్రంథమనఁదగు నథర్వణకారికావళి రెండవ ముఖ్య గ్రంథముగా వెలయుచున్నది. ఈయాంధ్రశబ్దచింతామణికిఁ దెనుఁగున నప్పకవియు సంస్కృతమున నహోబలపతియు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. నన్నయభట్ట కృతమగు నాంధ్రశబ్ద చింతామణిలోఁ దెనుఁగును గుఱించి

సూ॥ ఆద్యా ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే! ఏషా తయోర్భవేద్వికృతిః-
కేవలతయాను సర్వత్యుభేచ యేయం యథాతథం భాషా॥

అనియును నథర్వణాచార్య వికృతి వివేకమునందు.

సూ॥ ఆద్యా మహేశ్వా సా మూలం సర్వస్యేతి నిగద్యతే।
తదనుక్తస్య కార్యస్య వక్తా భవతి పాణినిః॥

అనియును వ్రాయఁబడెను. ఆంధ్రభాషయొక్క భేద ములను వివరించుచు

తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చే యం చతుర్విధా భవతి.

ప్రకృతిద్వయజా తజ్జా; తుల్యా తు సమా ; ప్రవాహినీ దేశ్యా, అనియు నాంధ్రశబ్ద చింతామణియందుఁ జెప్పఁబడినది. పయివాక్యములను బట్టి యనేకు లాంధ్రభాషకును సంస్కృత మునకును జన్యజనకభావమును బ్రథమద్వితీయాచార్యులు వివ రించినట్లు భ్రమించి యున్నారు. కావుననే యాంధ్రభాషకుఁ

ఋూర్వులు సంస్కృతభాషా జన్యత్వము నొప్పుకొనిరని కాల్డ్వె ల్లు మొదలగువారు వ్రాయుట సంభవించినది. పయివాక్యము లను సమన్వయము చేయునప్పు డహోబలపతి తనవ్యాఖ్యాన మునందు 'ప్రకృతయోర్వి కృతిః' అను దానికిని బయియథర్వణ కారికకును సమన్వయముఁ జేయుచు నిట్లు వ్రాసెను. "ఆంధ్ర భాషాతయోరాద్య ప్రకృ ప్రకృత్యోః వికృతిర్భవతి. ఉభ యానుసారిత్వేన ఉభయవిలక్షణత్వేనచ ఉభయాపేక్షయా వికృతిత్వం. వికృతి వ్యపదేశాత్ ప్రకృతి వద్వికృతిరితి న్యాయేన అనుక్తస్య కార్యస్యాత్ర తాభ్యాం ప్రాప్తిరిత్యాచార్యాశయః" పయిదాని యర్థము:—ఆంధ్రభాష మీదఁ జెప్పఁబడిన యాద్య ప్రకృతియొక్కయుఁ బ్రకృతియొక్కయు వికృతి. వికృతి శబ్ద మేల యుపయోగింపఁ బడినదనఁగా నాంధ్రభాష పయిరెండు భాషల ననుసరించుటయు వానికంటె విలక్షణత్వమును గలిగి యుండుటయునను లక్షణములు గలది గనుక. అనఁగా వికృతి పదమునకుఁ దజ్జన్యత్వ మిక్కడ నర్థముకాదనియు నుభయాను సారిత్వమును నుభయవిలక్షణత్వమునే యర్థమనియు ననుసం ధింపఁదగినది గదా. ఇంతియగాక 'ప్రకృతివద్వికృతిః' యను న్యాయము ననుసరించి యాంధ్రవ్యాకరణమునందుఁ జెప్పఁ బడని కార్యములు సంస్కృత ప్రాకృతములవలె ననుసం ధించుకొనవలసినదని యభిప్రాయము. ఇక్కడ నుపయోగింపఁ బడిన న్యాయము మీమాంసా న్యాయము గావునఁ బ్రకృతి వికృతులకు జన్యజనక భావమభిప్రేతముగాదని చెప్పకతప్పదు. ప్రకృతియందలి ధర్మములు వికృతిలోని కతిదేశములయి వచ్చు నని పయిన్యాయము తెలియఁ జేయుచున్నది. కావునఁ బయివివర

ణముఁ బట్టి పరీక్షింపఁగా వికృతి శబ్దమాత్ర ప్రయోగముచే సంస్కృతాంధ్రముల రెండింటికిని జన్యజనక భావమభిప్రేతమని యూహించుట భ్రాంతియని నిశ్చితమగుచున్నది. ఇఁక ద్వితీయాచార్యుని వాక్యమగు "ఆద్యా మహార్హా సా మూలం సర్వస్యేతి నిగద్యతే, తదనుక్తస్య కార్యస్య వక్తా భవతి పాణినిః" అనునదిగూడ పయిదానితో సరిపోవుచున్నదని చెప్ప నక్కఱలేదుగదా. పయి వాక్యమునందలి మూలమ్, అను శబ్దమునకుఁ బ్రకృతియర్థమని శ్రీవజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవారు వ్రాయుచున్న యాంధ్రశబ్ద చింతామణ్యాథర్వణకారికావళీసమన్వయరూపకస్వకీయవ్యాఖ్యానమున నీ సూత్ర సందర్భమున వివరించియున్నారు. ఇంతియగాక కవిశిరోభూషణమునందే యహోబలపతి "సర్వభాషా మూలకత్వేన, ఆంధ్రభాషా మూలకత్వేన, ఆంధ్రభాషా హేతుత్వేనచ, అనియును సంస్కృత భాషాయాస్సకల భాషా నిదానత్వాత్' అనియును వ్రాసిన వాక్యములను బట్టి జన్యజనక భావమాంధ్ర భాషకును సంస్కృత భాషకును గల్పింపఁగూడదా యని ప్రశ్నింపవచ్చును. సంస్కృతభాషకు సకల భాషా జనకత్వమును జెప్పుటయందు సంస్కృతభాషా ప్రాచీనతయును, ననేకభాషా జనకత్వమును నభిప్రేతములని నిర్ణయింపవలసియున్నది. ఆంధ్రభాషా హేతుత్వేన, అని హేతుపదము నుపయోగించుటయందు * ఛత్రిణోగచ్ఛంతి, యను

* గొడుగులు దాల్చినవారు పోవుచుండఁగా వారితో గొడుఁగులు లేని వారున్నను వారిని గూర్చి చెప్పఁబడు పయివాక్యమును బట్టి లేనివారికిని గ్రహణము కలిగినట్లు.

న్యాయముచే నాంధ్రభాషయందలి తత్సమ తద్భవ హేతుత్వము మాత్ర మభిప్రేతమని నిశ్చయించి శ్రీశాస్త్రులవారు పయి గ్రంథముననే విరచించియున్నారు. ఇఁక నొకప్పుడు జన్య జనక భావమునహోబలపతి యుద్దేశించిన దానినిగా నిర్ణయించి నను ప్రథమ ద్వితీయా చార్యుల వాక్యములయందట్టి యభి ప్రాయమున్నదనుట కవకాశము లేదు గావునఁ బూర్వులగు నాంధ్ర వ్యాకరణకర్త లాంధ్రభాషకును సంస్కృతమునకును జన్యజనక భావమును నంగీకరించిరనుట పరాస్తమగుచున్నది. సంస్కృత ప్రాకృతము లందలిపదములను గ్రహియించి యాంధ్ర విభక్తుల యోగముచేతనే యుపయోగింపనగునను నియమ ముండుటచేతను నాంధ్రభాషకు సంస్కృతేతరమగు స్థితి యున్న దనుట నిశ్చయమనియు శాస్త్రులవారు పయిగ్రంథముననే వ్రాసిరి. ఇంతియగాక యనేక దేశ్య శబ్దములు తెనుఁగునందున్న వని "ప్రవాహినీ దేశ్యా" యనునవి మొదలగువాక్యములలో వైయాకరణు లొప్పుకొనుటయుఁ బయి జన్య జనక భావమును ప్రాచీనుల మతమున కంటఁగట్టుట కొక ప్రబల ప్రతిబంధ ముగా నున్నది గదా! చూడుము. అప్పకవీయము.

క॥ జలశయన యాంధ్రదేశ్యం,బులు రెండు దెఱంగులయ్యె
భువి శుద్ధాంధ్రంబులు, నన్యదేశ జాంధ్రంబులునా

కావునఁ బూర్వులొప్పుకొనిన యత్కించి జ్జన్యత్వము నందభిప్రేతములు తత్సమ తద్భవంబులు గాని యాంధ్ర భాషా సామస్త్యముగాదని విచక్షణు లెఱుంగుదురుగాక.

ఆంధ్ర వైయాకరణులు దెల్పిన యభిప్రాయములను బయిని విమర్శించి యితర ద్రావిడభాషా వైయాకరణుల

వ్రాంతలను బరీక్షింతము. కర్ణాటకభాషకుం బ్రామాణిక వై యాకరణుండగు కేశిరాజును దన శబ్దమణిదర్పణమునం గర్ణాటక భాషాపదములను సమసంస్కృతములనియును, దద్భవము లనియును, దేశీయములనియును విభజించియున్నాండు. ఈదేశీ యములనే యచ్చ గన్నడమనియును శుద్ధయనియును న్యవహ రించియున్నాండు. దీనినిబట్టి కర్ణాటక భాషకును సంస్కృతము నకును జన్య జనక భావమును వివక్షించుటయం దాతని కభి ప్రాయము గన్పట్టుట లేదని తేలునుగదా! సమసంస్కృతము లను దద్భవములను బరిహరింపంగా మిగిలినవి కన్నడభాషా పదములనియును సంస్కృత ప్రాకృత భాషా విరహితమగుట బలహీనంబయినను గన్నడభాషకు వ్యక్తిత్వంబుగలదనియుం, బయి వ్రాతంబట్టి యూహింపనగును. ఈ యభిప్రాయమునకు వ్యతిరిక్తముగా నితరులగు కన్నడ వైయాకరణు లెవ్వరును వ్రాయలేదు.

ఇంక మలయాళమునకు వ్యాకరణమును వ్రాసినకోవుణ్ణి నెడుంగాడిగారు తమ కేరళ కౌముదియందిట్లు వ్రాసిరి.

"సంస్కృతహిమగిరిగళితా, ద్రావిడవాణీకళింద
జామిళితా, కేరళ భాషాగంగా విహరతు—"

"ఆర్యద్రావిడవాగ్జాతా కేరళీయోక్తికన్యకా".

పయి వాక్యములనుబట్టి మలయాళభాష గూడ సం స్కృతాపభ్రంశమాత్రమని నిర్ణయింప నలవిగాదుగదా! మల యాళభాషయందు సంస్కృత బాహుళ్యముండుటచే సంస్కృత హిమగిరిగళితాయని యాయన మలయాళ భాషను గుఱించి పలికెను గాని ద్రావిడవాణీకళిందజామిళితా, ద్రావిడ వాగ్జాతా

యనియుఁ జెప్పుటచేత ద్రావిడభాషా సార్థక్యమందును నున్నదనియే యొప్పుకొననగునుగదా! కేరళపాణినీయమను ప్రామాణిక వ్యాకరణమును వ్రాసిన రాజరాజ వర్మగారును దమ గ్రంథమునఁ గ్రింది వాక్యములోఁబయి యభిప్రాయ మునే యనఁగా సంస్కృత సమములు సంస్కృత ప్రాకృత భవములు లేకున్నను మలయాళ భాష ప్రత్యేకముగా నుండు నను దానిని గ్రిందివాక్యములో వెలిపుచ్చిరి.

"పలవగ కొడుంద మిళుగళ్ ఉండాయిరున్నదిల్ ఒన్నా ణు నమ్ముడె మలయాళ మాయి తీర్నదు" (అనేకములగు కొడుం దమిళులలో నొకటియే మనమలయాళభాష యయినది.)

ప్రాచీనద్రావిడభాషా కుమారికలగు నాంధ్రమలయాళ కర్ణాట తమిళములయందుఁ బెద్దయక్కయగు తమిళభాషకు నుపలబ్ధములగు వ్యాకరణములవ్రాసిన పండితులలో మొదటి వాఁడగు తొల్కాప్పియర్ అనునాయన తనవ్యాకరణమున సం స్కృతపదములు తమిళ సంస్కృత సమానవర్ణకములగు నపు డపభ్రంశములు గాకుండఁగను, దద్వ్యతిరిక్తముగ నుండు నపుడయ్యవి వర్ణవ్యత్యయ వర్ణవికారాదులగు మార్పులచేఁ దమిళాక్షరములను మాత్రము పొందునటుల మారి తద్భవ ములుగను, గావ్యములయందుఁ బ్రయోగింప వచ్చుననియును బరిహరింపవలసిన యవసరము లేదనియును ననుగ్రహించెనని క్రిందిమాటలఁబట్టి తెలియుచుండఁగాఁ దమిళమునకు సం స్కృత భాషాజన్యత్వము నొప్పుకొనెనా యని శంకాలేశము నయినను గలిగించుకొనుట కవకాశముండదని చెప్పకతప్పదు గదా.

"ఇయఱ్ చొల్, తిరిచొల్, దిసై చ్చొల్, వడసొల్ ఎన్ఱు, అనై త్తే సెయ్యుళ్ ఈట్టచ్చొల్లే."

దీనికర్థము :—కృతులందుఁ బ్రయోగింపఁదగిన శబ్దము (చొల్) నాలుగువిధములు. (1) ఇయఱ్ చొల్—చెందమిళు శబ్దములుగా నుండి మార్పునుజెందక యెల్లరకును (పండిత పామరసామాన్యముగా) నర్థమును బోధించుశబ్దములు.(2) తిరి చొల్—పదములు మార్పుచెంది పండితులకు మాత్ర మర్థ బోధకముగా నుండునవి. (3) దిసై చ్చొల్—అన్యదేశ శబ్ద ములు. (4) వడసొల్—సంస్కృతశబ్దములు (ఉత్తరశబ్ద ములు.) ఈవడసొల్ అనఁగా సంస్కృతశబ్దములు రెండు విధములు—(1) వడసొల్ కిళవి వడ వెழுత్తు ఒరీ ఇ, యెழு త్తోడు పుణర్ంద సొల్లాగుమ్—సంస్కృతశబ్దములు సంస్కృ తాక్షర విహీనములుగానున్నవి శబ్దములగుచున్నవి. ఉ॥ కమ లమ్ అమలమ్ మొ॥ (2) సిదైందన వరినుమ్ ఇయైందనవరై యార్. అక్షరశైథిల్యము వచ్చినను (భాషను) పొందినవి పరి హరింపరు ఉ॥ తచ (దశ). భాషను బొందినవి పరిహరింపరు, అనుటచే సంస్కృతపదములు వాడుకవలన జనగృహీతముల యినయెడల వానిని బండితులు గ్రహింపనగునని గదాయర్థము. అనఁగా నీకాలమున నాంగ్ల భవములగు 'రోడ్డు' మొ॥ శబ్ద ములు గ్రహియింపనగునా యను సంశయమున్నట్లె యిప్పు డును సంస్కృత వికారములగు పదములను గ్రహియింపనగునా యను సంశయము వ్యాకర్తలకుండినట్లు తెల్లముగదా!

పయి యుదాహరణములంబట్టి ప్రాచీనులగు ద్రావిడ భాషావ్యాకర్తలు ద్రావిడసంస్కృత భాషలకు జన్యజనక

భావమును వచియింపలేదనుట కింతకంటె నేమి ప్రమాణము కావలయును ?

అయినను ప్రాకృతభాషావివరణ మొనరించునప్పుడు ద్రావిడీ, యని యొక ప్రాకృతభేదమును జెప్పినవారి మాటల కేమి సమాధానమని యడుగవచ్చును. ద్రావిడభాషలను గుఱించి ద్రావిడభాషావైయాకరణులు చెప్పినమాటలు మనకు ముఖ్యముగా విమర్శనీయములుగాని యన్యులమాటల ప్రమాణములనియును భ్రమమూలకములనియుఁ ద్రోసివేయు టలో సంశయింప నక్కఱలేదని చెప్పుటయేల. పైవారు చెప్పిన ద్రావిడపదముచే తమిళముగాని మఱియే ద్రావిడ భాషగాని యభిప్రేతమగు నెడల వారివాక్యమును మనము విచారమూలకమని త్రోసివేయనగును. ఇంతకును బయి పదము తోనున్న శ్లోకము సమూలముగను సప్రమాణముగను స్థాపింపఁ బడియుండమిఁజేసి దానిని గుఱించి విశేషముగాఁ జర్చింపలేదు.

ఇఁకఁ బారమార్థిక దృష్టితో మనము పరీక్షించుట వలనఁ గల్పింపఁగల సిద్ధాంతమును డుదిని గనుఁగొన నగును.

---

# IV. ద్రావిడభాషల యుత్పత్తిని గుఱించి నవీనుల యభిప్రాయములు.

---

ఈ విషయమునందు మిక్కిలిగాఁ బరిశ్రమఁ జేసినవారు పాశ్చాత్యులగుటఁజేసి వారు మొట్టమొదటఁ బ్రాచ్య విజ్ఞానమును గ్రహియించి యందు భాషాశాస్త్రమును గుఱించి పని చేయుటకుఁగల కారణములను ముందు గొంచెము ప్రస్తావించెదను.

పాశ్చాత్య దేశములనుండి జనులు వర్తకము కొఱకును జయించు నభిలాషతోడను హిందూదేశమునకుఁ బూర్వకాలమున వచ్చుచుండినట్లు చారిత్రకు లెఱింగినదియే గదా. ఇట్లు వచ్చుట ప్రాచీనకాలమున భూమార్గమున నే జరుగుచుండెడిది. ఆ వచ్చినవారిలోఁ గొంద ఱీదేశమునుండి ధనమును సంపాదించి తమదేశములకు వెడలిపోయిరి. మఱికొంద ఱిక్కడికి వచ్చి యీదేశమునందుఁ బ్రభుత్వము చేయనెంచి దేశీయులతో యుద్ధముచేసి జయించి కొంతకాలము ప్రభుత్వముఁగూడ జేసిరి. ఇట్లు పాశ్చాత్యదేశములకు హిందూదేశముతోఁగల సంబంధము నాదియై యున్నదని వేఱ చెప్ప నక్కఱ లేదు. కాలక్రమమున హిందూదేశమునకుఁ బాశ్చాత్య దేశములనుండి జలమార్గమును గనిపెట్టఁబడినది. దానివలన నీదేశమునకు వచ్చిన పాశ్చాత్యులధిక సంఖ్యాకులయి తుది కీదేశమును జయించి తమ ప్రభుత్వమును నిలుపుకొనిరిగదా.

ఈ పాశ్చాత్యులు హిందూదేశమునకువచ్చి సంస్కృత భాషను బఠించుట ప్రాపంచిక విజ్ఞానమునకుఁ గొప్ప యభివృద్ధి కవకాశము గల్పించినది. ఈ సంస్కృతమును బఠించుటచేఁ గలిగిన భాషాశాస్త్రమువలన గొప్పవగు నూతన సిద్ధాంతములు వెలుఁవడుట కవకాశముగల్గినది. హిందువులును బాశ్చాత్యదేశములందున్న తెల్లవారును నొక్కజాతివారేయనియు ననేక సహస్రసంఖ్యాకంబులగు సంవత్సరములకుఁ బూర్వమొక్కచోటనే నివసించుచుండెడు వారనియు నీశాస్త్రసాహాయ్యముననే నిర్ణయింపఁబడినది. ఇట్లు ప్రారంభింపఁబడిన ఇండోయూరపియన్ ఫిలాలజీయను శాస్త్రముయొక్క ముఖ్యసిద్ధాంతము మొట్టమొదట 1786-వ సం॥మున సర్ విల్లియముజోన్స్ గారు చెప్పినమాటలలో నున్నదని యొప్పుకొనకతప్పదు. "There is a similar reason though not quite so forcible for supposing that both the Gothic and the Celtic though blended with a different idiom, had the same origin with the Sanskrit idiom." తరువాత బాప్‌దొరగారు (జర్మనుదేశస్థులు) గ్రిమ్మ్‌దొరగారు, మఱికొంతకాలమునకు విట్నీగారు మొదలగు వారందఱును మఱికొందఱును జేసినపనిచే నీనాటికి ఇండో జెర్మానిక్ భాషాశాస్త్రము మిక్కిలి యభివృద్ధిఁ జెందినది. ప్రతిదినమును గ్రొత్త క్రొత్తవిషయములు చర్చింపఁబడుచునే యున్నవి. ఇట్లు ప్రారంభింపఁబడిన భాషశాస్త్రము తక్కిన భాషలయొక్క చరిత్రమును బరిశోధించుటలోఁగూడ నత్యంత ముపకరించినది. ఆమార్గముననే యితర భాషలును నందుఁ బ్రకృతవిచార

ణీయములగు ద్రావిడభాషలును బరిశోధింపఁబడి యీనాటి ద్రావిడభాషాశాస్త్రమునకు మార్గదర్శకములయినవి.

పాశ్చాత్యులు హిందూదేశమును జయించి యందుఁ దమ ప్రభుత్వమును నెలకొల్పుటకుముందే హిందూదేశము నందలి జనులను దమమతమునకుఁ ద్రిప్పుకొనుటకుఁ గ్రైస్తవులు వచ్చుచుండుట సంభవించెను. అట్టి యభిప్రాయము తోడనే యక్బరు కాలమునందు 'జెసూట్‌మిషను' అను పేరఁ గొందఱు మతబోధకులు మొగలు దర్బారునకు వచ్చినట్లును దెలియుచున్నది. అట్టి మతప్రచారమునకుఁ బనిచేయు సంఘములకుఁ బాశ్చాత్యప్రభుత్వము నెలకొనిన యనంతరము సౌకర్యములు హెచ్చయినవి. ఈమతబోధకులకు మతవ్యాపక సంఘము వారొసంగు ద్రవ్యమును నితరసాహాయ్యములును వారిని హిందూదేశమునందుఁ బ్రాబల్యము వహించునట్లు చేసినవి. ఆక్రైస్తవ మతబోధకులు హిందూదేశమునకును సంఘమునకు నొనర్చిన యుపకారములను జర్చించుట కియ్యది యదను గాదు గాని వారొనర్చిన యనేకములగు మేళ్లలో ద్రావిడ భాషాశాస్త్రము నభివృద్ధిచేయుట ముఖ్యమయి నది. మతమును బోధించుటలో మతబోధకులకు మతాంతరులతోఁ బ్రసంగించుట యవసరముగావున వారి భాషలను బఠించుట యావశ్యకమయ్యెను. ఆ కారణమున ననేకులగు క్రైస్తవమతబోధకులు హిందూదేశమునందలి నాగరక భాషలను ననాగరక భాషలనుగూడఁ జదివి యందుఁ దమబైబిలును బరివర్తించి వెలయించిరి. వారిలో ద్రావిడభాషలను

జదివిన మతబోధకులా యాభాషలకుఁ గొప్పయుపకారమును గూడఁ గావించిరి.

అట్టివారిలో డాక్టరు కాల్డ్వెల్లు, రె॥ కిట్టెలు, డాక్టరు గుండెర్టు మొ॥ వారు ముఖ్యులు. వీరందఱును మతబోధకుల సంఘముపక్షమున ద్రావిడబాషలను బఠించినవారే. కిట్టెలు గారు కన్నడమునకును, గుండెర్టుగారు మలయాళమునకును, పోపు, విన్లోసు మొదలగువారు తమిళమునకును, బ్రౌనుదొర గారు (వీరు మతబోధకులుకారు) తెలుఁగునకును ద్రావిడ భాషల సమష్టికి కాల్డ్వెల్లుగారును నొనర్చిన యుపకారము వర్ణనాతీతము. వీరందఱును గొంచెమించు మించుగా సమ కాలికులు గావున వీరి పౌర్వాపర్యములను గుఱించి చర్చించుట లాభకారి కానేరదు.

డాక్టరు గుండెర్టుగారు 1882 వ సం॥ మున దమ మల యాళపుఁ గోశమును బ్రచురించిరి. వీరి కోశమునకుఁ బూర్వు లగు క్రైస్తవ బోధకులు చేసిన పరిశ్రమలు చాలనుట్టున కుపకరించినవి. 1893 వ సం॥న కిట్టెలుగారు తమ కర్ణాటక కోశ మును ముగించిరి. ఇంతియగాక గుండెర్టుగారు 1868 వ సం॥ మున మలయాళమునకు మలయాళభాషలో నొక వ్యాకరణ మును వ్రాసిరి. దీని తరువాత దేశీయులును మలయాళభాషకు వ్యాకరణములను రచియించిరి. కిట్టెలుగారును కర్ణాటకభాషను గుఱించి యాంగ్లభాషలో నొక వ్యాకరణమును వ్రాసిరి. మైసూరిలో నుద్యోగిగానుండిన రైసుదొరగారును గర్ణాటక భాష కొనరించిన మహోపకారమును వర్ణింప నలవిగాదు. 1862 వ సంవత్సరముననే విన్లోసు దొరగారు తమిళ కోశమును

ప్రచురించిరి. ఇట్లనేకులగు మతబోధకుల మూలమున ద్రావిడ భాషలు ముందునకుఁ దేఁబడిన విషయము పాఠకులు గుర్తింతురుగాక. ఇట్లుండ కాల్డ్వెల్లుగారు 1859 వ సంవత్సరముననే తమ ద్రావిడభాషా వ్యాకరణముయొక్క ప్రథమ ముద్రణము నొనరించిరి. వీరు ద్రావిడభాషలలో ముఖ్యముగాఁ దమిళ మలయాళములను దక్కిన ద్రావిడభాషలను బఠించి యితరులు పరిశ్రమఁజేసి వ్రాసిన యనేకగ్రంథసాహాయ్యమునఁ దమ గ్రంథమును వ్రాసి ముద్రించిరి. తరువాత నెన్నియో విషయములఁ జేర్చి 1872 వ సం॥ మున దమ గ్రంథమును దిరిగి ముద్రించిరి. ఈ గ్రంథరచనకు ననేకులు పరిశోధన సంచికలలోఁ బ్రచురించిన వ్యాసములును మూలములయినవి. ఆ తరువాత కాల్డ్వెల్లుగారి వ్యాకరణము తిరిగి తిరిగి ముద్రింపఁ బడుచునే యున్నది.

'ప్రమాదో ధీమతామపి' యను న్యాయమునఁ జేసియు, ద్రావిడభాషలు తనకు మాతృభాషలు కాకుండుటఁ జేసియు, తాను పూనుకొనిన కార్యముయొక్క గొప్పతనముఁ జేసియు, నెఱసులున్న నుండవచ్చునుగాని కాల్డ్వెల్లుగారి పుస్తకమును మించిన ద్రావిడభాషా వ్యాకరణ మిప్పటికిని నెవ్వరిచే వ్రాయఁబడలేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇతరులు వ్రాసినదానిఁ గాదనుటఁ దమకు ఖ్యాతిరాఁగలదని యూహించి కొందఱును, కాల్డ్వెల్లువంటి వారిని గాదంటిమే యని కీర్తిని సంపాదింపఁ దలఁచి కొందఱును, ముందు ప్రతిపాదింపఁబడిన పద్ధతులకు భిన్నములయిన సిద్ధాంతములను బ్రతిపాదించితిమని కీర్తిని సంపాదింపఁదలంచి కొందఱును గాల్డ్వెల్లు

గారి సిద్ధాంతములను దృఢీకరించుటకుఁ బ్రయత్నించినఁ బ్రయత్నింతురుగాని యాయన ముఖ్యసిద్ధాంతములను నాయన సత్య పక్షపాతమును మాత్ర మెవ్వరును నిప్పటికిని యుక్తియుక్తముగా ఖండింపలేదని చెప్పకతప్పదు. ఆ తరువాత 1898 వ సం॥ మున గ్రియరుసనుగారిచే బ్రారంభింపఁబడిన లింగ్విస్టిక్ సర్వే యందును ద్రావిడభాషలను గుఱించి యనేకోపయోగకరములగు విషయములు వ్రాయఁబడినవి.

ఇఁక దేశీయుల ప్రయత్నముల నీ సందర్భమునఁ జెప్పుటకుఁ దగిన గ్రంథములు లేకున్నను 'సూత్రస్యైవాస్తి మే గతిః' అను న్యాయమునఁ గొన్నిటిని మాత్రము పేర్కొనియెదను. కీ॥ శే॥ టి. శేషగిరి శాస్త్రులవారు ప్రెసిడెన్సీ కాలేజీ యందు ప్రొఫెసరుగానుండి సంస్కృతమునందే గాక యితర ద్రావిడభాషలయందును దగిన పరిశ్రమముఁ జేసి యాయా దేశభాషలయందు గొన్ని భాషా శాస్త్రగ్రంథములను రచియించిరి. ఆ తరువాత స్వామినాథ అయ్యరుగారు ద్రావిడ భాషకు సంస్కృతభాషా జన్యత్వమును నిర్ణయింపఁదలంచి గొన్ని వ్యాసములను బ్రచురించిరి. ఆ వెనుక వారి పద్ధతి ననుసరించి చిలుకూరి నారాయణరావుగారును ద్రావిడ భాషలకు సంస్కృత ప్రాకృత భాషా జన్యతను నిర్ణయింపఁ దలంచి యాంగ్లమున నొక చిన్ని పొత్తమును బ్రచురించిరి. వారు మాకు సమకాలికులుగావున వారి గ్రంథమును గుఱించి యభిప్రాయమిందు వ్రాయఁజాలకున్నాము. అయినను నానుషంగికముగా నక్కడక్కడఁ గొన్ని సిద్ధాంతములను మాత్రము విమర్శింతుము.

ఇఁకఁ బయివారందఱును నీద్రావిడభాషల కేభాష లతో జన్యజనకభావమును జెప్పిరి యను దానిఁ గొంచెము విమర్శించి యీ ప్రకరణమును ముగింతుము. ద్రావిడభాష లకు సితియను భాషలతోడను, ఇండో యూరపియను భాషల తోడను బోలికలున్నవిగాని యా భాషలకిండో యూరపి యను భాషలకంటె సితియనుభాషలతో నెక్కువ పోలిక లున్నవని చెప్పనగునని కాల్డ్వెల్లుగారి యభిప్రాయము. ద్రావిడభాషలును, సితియను భాషలును, ఇండో యూరపియను భాషలను నొక్క కాలమునఁ గలిసియున్నవని దీనినిబట్టి యూహింపనగునని వీరి మొత్తపు టభిప్రాయము. వీరికి సమ కాలికులగు డాక్టరుపోప్‌గారు మొట్టమొదట వీరి యభిప్రాయ మునుండి భేదించుచు ద్రావిడభాష లిండోయూరపియను భాష లతో దగ్గఱ సంబంధమును గలిగియున్నవనియును సితియను భాషాకుటుంబమునకుఁ జేరిన వానిఁగా వీని నొప్పుకొనఁ జాల మనియుఁ జెప్పి "Yet they are certainly not mere prakrits or corruptions of Sanskrit." యివి నిశ్చయ ముగా సంస్కృత జన్యములు మాత్రము కావని చెప్పి యున్నారు.

కిట్టెలుగారును, గుండెర్టుగారును గూడఁ గొన్ని శబ్ద ములు సంస్కృత జన్యములగునా కావా యను విషయములో కాల్డ్వెల్లుగారితో భిన్నాభిప్రాయము నొందిరని చెప్ప వలసివచ్చినను ద్రావిడభాషలు సంస్కృత ప్రాకృతజన్య ములుగా వనుటలో విప్రతిపత్తిని శంకింప నైనను లేదు. గ్రియరుసనుగారు తమ లింగ్విస్టిక్ సర్వేయందుఁగూడ ద్రావిడ

భాషలకు సితియను భాషా జన్యత్వము నొప్పుకొనకుండియు, నిండో యూరపియను భాషా జన్యత్వమును నిరాకరించిరి. ద్రావిడ భాషలకును హిందూదేశమందలి కొందఱ నాగరకులు మాటాడు ముండా భాషలకును సంబంధమును వీరు శంకించియున్నారు. ఇండో యూరపియను భాషా జన్యత్వమును నిరాకరించిన వీరి మతమున ద్రావిడ భాషలకు సంస్కృతప్రాకృతభాషా జన్యత్వ మత్యంతదూరా ప్రాప్తమగుసను టలో విప్రతి పత్తిలేదు గదా! ఇఁక ప్రొఫెసరు శేషగిరిశాస్త్రి గారును ద్రావిడభాషలకు సంస్కృత ప్రాకృతభాషా జన్యత్వము నొప్పుకొనలేదని చెప్పవచ్చును. కీర్తి శేషులగు స్వామినాథయ్యరుగారును గీర్తిమంతులగు నారాయణరావుగారును ద్రావిడ భాషలకు సంస్కృత ప్రాకృత జన్యత్వమును నిరూపించుటకు ప్రయత్నించువారు. తమ సిద్ధాంతమును నిరూపించుటయందు వీరికిఁ గల యభినివేశముకంటెబలమగు ప్రమాణములు వీరికిఁ దొరకునుగాక.

ఇఁక మామతమున ద్రావిడ భాషలకును సంస్కృత ప్రాకృతములకుఁ గల సంబంధమును ముందు వివరింతుము.

---

# V. భాషలకుఁగల సంబంధమును గనుఁ గొనుట యెట్లు.

-----

ద్రావిడభాషలకును సంస్కృత ప్రాకృతములకును జన్య జనకభావము గలదాయను ప్రశ్నమున కుత్తరమిచ్చుటకుఁ బ్రయత్నించుటకుముందు, వేర్వేఱు భాషలకుఁ గుటుంబ సంబంధమును నిర్ణయించుటకు ముందు చేయవలసిన పరీక్షణమును గుఱించియు, నవలంబింపవలసిన నియమములను గుఱించియు సంక్షేపముగా వివరింతుము.

(1) ఒకజాతియొక్క భాషాపరిణామమునకును నాగరకతాపరిణామమునకును ముఖ్యమగు సంబంధము గలదు. భాష మానవుల విజ్ఞానమును నభ్యాసములను, భావములను వేయేల సర్వమును దెలియఁజేయునుగావున నాగరకతోన్నతికి భాషా వైశాల్యము సూచికవంటిది. ప్రవాహినీదేశ్యా, యని నన్నయ భట్టు తనయాంధ్రశబ్దచింతామణియందుఁ జెప్పినట్లొక దేశ మందలి భాష ప్రవాహమువలె నవిచ్ఛిన్నముగాఁ దరతరముల నుండి యాదేశప్రజనులకుఁ బిత్ర్యమువలె సంక్రమించుచు నానాటి కభివృద్ధిఁ జెందుచుండును. అట్టి ప్రవాహమున నన్య భాషాపదములప్రయత్నముగా వచ్చి కలియుచుండును. ఇందు కుదాహరణము తెనుఁగుభాషయందలి తత్సమ తద్భవ పదజాలమని చెప్పనగును. కావున నాపదములను జాగరూగ తతోనేర్చి రూఢిగా నాభాషలలోనివసందగు పదములనే

పరీక్షించి వానికితరభాషాపదములతో నియతమైన సంబంధము కనుపట్టిననేగాని యాభాషలేకమాతృకములని గాని జన్యజనకములని గాని నిర్ణయింపరాదు. ఉ॥ తెనుఁగు నందలి తత్సమ శబ్దమగు 'కర్త'యను దానికిని ఇంగ్లీషునందలి '(క్రియేటర్' అను దానికిని సంబంధము నూహించి యాభాషలకు జన్య జనక భావముఁ జెప్పఁటకూడదు.

(2) ఒకభాష మఱియొకభాషనుండి యనేకపదములను గ్రహియించినంత మాత్రమున నాభాషలకు జన్యజనకభావము నూహించుటకు వలనుపడదు. ఆంగ్లభాష సంస్కృతము నుండియు హిందూస్థానీనుండియుఁ బదములను గ్రహియించిన దని మన మెఱిగినంత మాత్రమున నాభాషలకు సోదరభావమును గాని జన్యజనక భావమునుగాని నిర్ణయించుట యనుచితము.

(3) పదముల యాకారమునుబట్టియు నర్థసామ్యము నాధారముగా గ్రహించియు, నితర సంబంధములను లెక్కింపక భాషలకుఁ బరస్పర సంబంధము నూహించుట యాదృచ్ఛికమగు స్వరూప సామ్యమును మాత్రము చూచి యిరువురు పురుషులకు బాంధవ్యమును నిర్ణయించుటవంటిది. ఆంగ్లభాషయందలి మాత్ శబ్దమునకును నాంధ్రభాషయందలి మూతి శబ్దమునకును, వర్ణానుగమసామ్యమును నర్థాభిన్నతయుఁ గలిగి యున్నవను నంతమాత్రమున నా రెంటికిని సంబంధము నిర్ణయింపనైతిగాదు. అట్లే యాంగ్లమునందలి నీట్ శబ్దమునకును దెనుఁగులోని నీటు శబ్దమునకును నభిన్నతను గల్పింపనగునా.

(4) రెండు భాషలయొక్క పదములను సరిపోలి చూచునప్పుడా పదములయొక్క ప్రాచీన రూపములను బ

క్షించి వాని సామ్యమును దానివలన వాని సంబంధమును నూహింపవలసినదేగాని వాడుకయందలి యపభ్రంశ రూపము లను గ్రహియించి సామ్యమును నిర్ణయించుట మానవుల కుల గోత్రాదుల నెఱుఁగక బాంధవ్యము నూహించుటవంటిదే గదా? ఉ॥ సంస్కృతమునందలి శబ్దము భవతి, దానికిఁ బ్రా కృతమందలి పరిణామము హోది, హవది. దీనిని దెనుఁగున విద్యావిహీనులు వాడునట్టి రూపమగు అవుద్ది అనుదానితోఁ బరీక్షించి యాభాషలకు జన్యజనక భావమును నిర్ణయించుట వైదానివంటిదే యగును. భవతి శబ్దము భూధాతు జన్యము. అవుద్ది అను రూపము అగుధాతు జన్యము.ఒకదానిలోనితి వర్ణ ము తిప్ అను తిఙ్విభక్తి ప్రత్యయము. రెండవదానిలోని దివర్ణకము'అది'యను సర్వనామముయొక్క పరిశిష్టము. ఈరెం టికిని నభిన్నతఁ గుదుర్చుట యాంగ్లదేశమునందలి రామ్సేగారి కిని తెనుఁగు దేశమందలి రామస్వామికిని నైక్యమునుగాని సమానోత్పత్తినిగాని కుదుర్చుటవంటిది గదా.

(౪) ఏపదమును మనము పరీక్షింపఁ దలంచికొన్నను దొలుదొలుత నా పదముయొక్క ప్రకృతి ప్రత్యయ విభాగము నొనరించి మూలరూపమునకు మఱియొక పదముతో సాదృశ్య మును నిరూపింపవలసినదేగాని యట్టి విభాగమును లెక్కింపక సిద్ధరూపమున ఘుణాక్షరన్యాయమునఁ గలిగిన సాదృశ్యమును గ్రహించి సంబంధమును నిర్ణయింపఁగూడదు. ఉ॥ సంస్కృ తమునందు పరస్పరమ్, అని శబ్దము. దానికిఁ బ్రాకృతరూపము అవరవరో, యనునది. ఈ శబ్దమునుండి కన్నడమునందలి అవ రవరు, అనునదియుఁ దెనుఁగునందలి 'వారు వారు' అనునదియు

బుట్టినవని యూహించుట. కన్నడమునందలి అవరవరు శబ్దము అవర్ + అవర్ అను రూపములు కలియుటచే వచ్చినది' అవర్ అను దానికి నేకవచనరూపము అవన్ లేక అవను. ప్రాకృతరూపమునుండి కన్నడరూపము పుట్టినదను నెడల అవర్ లోని బహువచన ప్రత్యయము గతియేమి. పదము ప్రత్యయ ముతోఁగూడ నిక్కడవచ్చి చేరినదని వాదించుట యసందర్భ ముగదా. ఈ అవళ్ శబ్దమునకు సంబంధిభాషలలో అవళ్,వా, అవను అని రూపములున్నవిగదా! వానిగతి యేమగును.

(6) ప్రతిపదమునందలి యక్షరములు మారునప్పుడు కొన్నిపద్ధతుల ననుసరించి యొకజాతిగా మారుచుండును. ఏ జాతియక్షరము లేజాతి యక్షరములయి యేసందర్భమున మారునో పరీక్షించి యేకపక్ష సాధన నిర్ణాయకములగు నుదాహరణములు దొఱకినతరువాత నా యక్షర పరిణామము నొక పద్ధతిగా గ్రహించి యితరములగు శబ్దములలోఁ బట్టింప వచ్చును. సంస్కృతమునందలి యుగశబ్దము తమిళమున నుగమ్, తెనుఁగున నొగ అనియును, సంస్కృత యమ శబ్దము తమిళ మున 'నమణ్' అనియును మారుటచే యకారము 'న' కార ముగా మారుటగలదని మొదట నిర్ణయించి యకారము నకార ముగా మారునని సిద్ధాంతముఁ జేసికొనిన యనంతరము 'యాణ్' అను శబ్దము 'నాణ్' అను దానికంటెఁ బ్రాచీన మగునని నిర్ణయించుట యుక్తము. స్వల్పశబ్దమునుండి పలుచ శబ్దము వచ్చినదని యూహింపనెంచి స్వల్ప, సలుప, చలుప, పలుచ యయ్యెననియు నూహించుట యశాస్త్రీయము. మొట్ట మొదట నాంధ్రభాషయందు నిశ్చయముగా సకారము

చకారముగా మారినదని నిర్ణయించి సిద్ధాంతముచేయక మున్నే పయిసిద్ధాంతమును జేయ బ్రయత్నించుట యపమార్గము గాదా ?

(7) భాషలను సరిపోల్చి చూడవలసి వచ్చినప్పు డెట్లయినను నీ భాషలకు జన్యజనక భావమునుగాని సోదరభావమునుగాని నిరూపింపవలయునను నిశ్చయముతో బయలుదేరిన యెడల నిర్ణయింపఁబడిన సిద్ధాంత మపమార్గ గామి యగుట కేమియు సందేహముండదు. సంస్కృత ప్రాకృతభాషలకును ద్రావిడభాషలకును ననేకములగు పదములనిచ్చి పుచ్చుకొనుట యున్నది గదా యని వానికి సోదరభావమును గాని పితాపుత్ర భావమునుగాని నిర్ణయించుట యొకరియింటిలో బాడుగకున్న మనుష్యునకాయింటి వారితో నెట్లో రక్తసంబంధమును నిర్ణయింప సమకట్టుటవంటిది.

(8) భాషలయొక్క యున్నతి ననుసరించి పదజాల మధికముగా నున్నను నాభాషకు ముఖ్యములును బ్రాచీనములును దప్పక మొట్టమొదటనుండి తీరవలసినవియునగునవి కొన్ని జాతుల పదములు మాత్రమే యుండును. ఇయ్యవి, పితాది సంబంధివాచకములు, సామాన్యములగుక్రియలు,సంఖ్యావాచకములు, సర్వనామములు మొదలగునవి. ఇవి ముఖ్యముగాఁ బ్రాచీనస్థితియందుండఁ దగినవి. అట్టి పదములకు బహుళములగు పోలికలున్ననే గాని భాషలయొక్క సంబంధములను నిర్ణయింపనలవి గాదు.

9) సమాన మాతృకములగు రెండు భాషలను బరీక్షించు నపుడొక్క-భాషలో నొకరూపమునందు వాడఁబడు పదము మఱియొక భాషలో నాయర్థములో నాసందర్భములోఁ గన్పట్టకపోవచ్చును. అంతమాత్రమున జంకక యాపద మెందైనను జిక్కి-కొని తన ప్రాథమికార్థమును మఱుగుపఱచుకొని యున్నదాయని పరీక్షింపవలయును. ఉ॥ తమిళమున 'ఏఱు' అనగా 'ఎక్కు-' అని యర్థము. తెనుఁగున నాపదమునకా యర్థములో విశిగా వాడుకలేదు. కావున నాపదమునకు సజాతీయమయినది లేదనక నెఱవేఱు, అనుక్రియ నెఱవు+ఏఱు అను వానివలన నయినదనియును నందున్న 'ఏఱు' అను పదమునకు మొదట (ప్రా_ర్తిని) ఏఱు=పొందు అను నర్థముండెననియును నూహింపనగును.

(10) ఒక భాషయందున్న వాక్యరచనయును, బదక్రమమును, విశేష్య విశేషణములకూర్పును, సమాసరచనయును, క్రియారూపముల నిష్ప_త్తియు, సంబంధవాచకములును, సముచ్చయార్థకములును నాభాషయొక్క- పునాదివంటివిగావున నాభాషకును మఱియొక భాషకును సంబంధమును నిర్ణయింప దొరఁకొనునప్పుడా విషయములను దప్పక పరీక్షింపవలయును. ఉ॥ ఇండో యూరపియను భాషలయందు సంబంధ బోధక సర్వనామములు గలవు. సం॥ యత్, తత్, ఆంగ్ల॥ Who, which etc. ద్రావిడ భాషలందట్లు లేవుగావున వానికి సంబంధమును గల్పించుటలోఁ గొంచెము సంశయింపవలసియున్నది.

భాషా పరిశీలన మొనరించునపుడు మనసు నందుంచు కొనవలసిన నియమములు పయిని దిఙ్మాత్ర ముదాహరింపఁబడి నవి. ఈ పయిపద్ధతులను గ్రహియింపక భాషలకుఁగల సంబంధము నూహించుట శాస్త్ర విరుద్ధము మాత్రమేగాక యంకములు సరిగా గుర్తించుట తెలియనివాఁడు (Progressions) అంకశ్రేఢుల లెక్కలను జేయఁ బ్రయత్నించుటవంటిది.

---

# VI. ద్రావిడభాషలు సంస్కృతజన్యములా ?

భాషలకుఁ బరస్పరసంబంధమును నిర్ణయించునప్పుడును బదములయొక్క పౌర్వాపర్యమును సిద్ధాంతముఁ జేయునప్పుడును నవలంబింపవలసిన నియమములను, మనము నందుంచుకొనవలసినపద్ధతులను ముందు దెల్పియుంటిమిగావున నాపద్ధతుల ననుసరించి యిఁక ద్రావిడభాషలకును సంస్కృతమునకును జన్యజనకభావమున్నదా యను ప్రశ్నమునకు సమాధానం బీయఁ బ్రయత్నింతుము. ఈసందర్భమున నొక్కొక భాషాభాగమునే క్రమముగాఁ బరిశీలించి యనంతరమున నితరములగు యుక్తుల నొసంగుదుము.

(I) అక్షరములు:—ద్రావిడభాషలయందలి యక్షరములకును (Sounds) సంస్కృతభాషయందలి యక్షరములకును గలపోలిక విదితమేగదా. సంస్కృతభాషనుండి తత్సమములును దద్భవములును నాంధ్రములోనికి వచ్చికలిసెననుటఁ జేసి యాపదముల నుచ్చరించునప్పుడా ధ్వనులును ద్రావిడభాషలలోనికి వచ్చెననుట సత్యమని యొప్పుకొనకతీరదు. కావుననే ద్రావిడభాషా వైయాకరణులు శుద్ధాంధ్రమున కక్కరము లిన్నియనియు, శుద్ధ కర్ణాటమున కిన్నియనియు, శుద్ధమలయాళమున కిన్నియనియు నిర్ణయించుట జరిగినది. ఇంతియగాక తమిళమునందు సంస్కృతపదములు మహాప్రాణాదు

లతోఁగలిసి ప్రవేశించుట కవకాశమునియ్యకయే తమిళులుతమ భాషాప్రవాహములోనికి వచ్చు సంస్కృతమునకడ్డు గట్టిరి. ఇట్లు భాషాసంప్రదాయమును నిర్ణయించుటంజేసి యీభాషలు సంస్కృతభిన్నంబులనియుఁ దజ్జన్యంబులుగావనియు వారియభిప్రాయము తెల్లమే గదా!

ఇఁక ద్రావిడభాషలందున్న యచ్చులలో హ్రస్వములగు 'ఎ' కారమును 'ఒ' కారమును నుండుటయును సంస్కృతము నందియ్యవి లేకుండుటయు వీని ప్రత్యేకతను బోధించుచున్నవి. ఇంతియగాక యీహ్రస్వములగు 'ఎ' కారమును 'ఒ' కారమును మధ్యకాలమునఁ బుట్టినవిగావనియు ననాదిగా నుండినవేయనియు శబ్దములను బరిశోధించినఁ దెలియఁగలదు. అ, ఇ, ఎ అను సార్వనామిక ప్రాచీనరూపములందును, ఒణ్, ఒంబదు, ఇత్యాది సంఖ్యావాచకముల యాదును నియ్యవి యుండుట విసంవాదమున కవకాశమీయని యాధారములు గావా. ఈ హ్రస్వస్వరములు ప్రాకృతము నందున్నవని బీమ్సు మొ॥ వారు చెప్పినమాటల నొప్పుకొని యయ్యవియిందు వచ్చినవని చెప్పఁగూడదా యను ప్రశ్నమునకును బయియుదాహరణమే సమాధానమని చెప్పకతప్పదు. ఇంతియగాక యీహ్రస్వాచ్చులకు ద్రావిడభాషల లిపులన్నిటి యందును నియతముగాఁ జిహ్నము లుండుటయుం బ్రాకృతమున లేకుండుటయుఁగూడఁబయి యూహనే స్థిరపఱచుచున్నది. ఈ 'ఎ'కారమునకును ఏకారమునకును భేదమనాదియని తెల్పుటకర్థభేదము గలిగిన ద్రావిడ దేశ్యపదములలో నియ్యవి యుండి యట్టి యర్థభేదములకుఁ దామే మూలమగుట బ

మయిన కారణము గాదా ? ఉ॥ తెళ్ — తేట, తేళ్ — తేలు. (త)

సంస్కృతమునందలి ' ఐ ' వర్ణమునకుఁ దమిళము నందలి ' ఐ ' వర్ణమునకును భేదముగలదు. సంస్కృతవర్ణము అయ్, అనియును, తమిళవర్ణము ' ఎయ్ ' అనియును నుచ్చరింపఁ బడుచున్నది. ఈ రెండును నభిన్నమని చెప్పి తప్పించు కొనుటకు వీలుగాకుండఁ దమిళ మందలి వర్ణము ప్రాచీనపు ' అ ' కారమునకుగాని ' ఎ ' కారమునకుగాని బదులుగా వచ్చినదని తెలియుచున్నది. ఉ॥ తల. తలె, తలై (త)

ఇఁక దేశభాషలయందలి హల్వర్గమును బరిశీలింతము. ఇందలి కచటతపలు, గజడదబలుగాను, గసడదవలుగాను మారుచుండుట సర్వ ద్రావిడ భాషా సామాన్యమును, వ్యాకరణ సమ్మతమునగుననివేఱ వచియింప నక్కఱలేదు. ఈ మార్పు తమిళ మలయాళములయందు నియతముగాఁ బద మధ్యమున సరళమును, బదాదినిఁ బరుషమును దెచ్చిపెట్టు చున్నదని యాభాషా పదములను బరీక్షించినఁ దేలుచున్నది. దంతము సం॥ త॥ తందమ్. బ్రాహ్మణః. త॥ పిరామణర్॥ ఈ మార్పు ప్రాచీనము గాదనియు నవీనమనియు గ్రియరుసను గారు, కుమారిల భట్టు 'పాంబు' అను దానికి బదులు 'పాంప్' శబ్దము నుదాహరించుటచేతను 'దమిళ్' శబ్దమును ద్రావిడుఁ దమిళులు గ్రహించుటచేతను నూహించుచున్నారు. కాని పరుష సరళములకు వేర్వేఱు చిహ్నములు లేని తమిళుల లిపి యందే యేస్థలములలో నేయే యుచ్చారణముఁ జేయవల యునో చదువరులు కనుఁగొనుట యెట్లు? ఉచ్చారణము

నందంతటను బయి పద్ధతియేకలదు గనుకను నిట్టి నియమము లేక పరుష సరళములకుఁ గల లిపిభేదము తెలియుట కష్టము గనుకను, నీపద్ధతి తమిళమునఁ బ్రాచీనమని మాయూహ.

ఇఁకఁ దమిళులు 'దమిళు' శబ్దమును సరళాదిగానే గ్రహించినట్లేమి ప్రమాణము. తమిళ్ అనియే ప్రాచీన గ్రంథములనున్నది గదా. కావున నీపద్ధతి ప్రాచీనమనియు ద్రావిడ భాషా స్వభావమునందలి ముఖ్య లక్షణమనియు మా సిద్ధాంతము. తెనుగునందుఁ బరుషములు సరళములగుట వికల్పమని యుదాహరించుటయు నీ యభ్యాసముయొక్క ప్రాచీనతను బాహుళ్యమును దెల్పుచున్నది గనుక మాసిద్ధాంతముపపన్న తరంబగునని చెప్ప నక్కఱలేదు. ఇట్టి స్వభావము సంస్కృత భాషలోఁగాని యింగ్లీషు యూరపియను భాషలలోఁ బ్రాచీనములయిన వానిలోఁగాని యున్నదని నిరూపింపవచ్చునా.

ద్రావిడ భాషలకుఁ జేరిన యాంధ్రమునందలి దంత్య తాలవ్య చ జలను గుఱించి కొంచెము చర్చింప వలయును. తాలవ్యచజలు సాంస్కృతికములనియును, దంత్యచజలు శుద్ధములనియును దెనుఁగు వైయాకరణుల సిద్ధాంతముగాన దంత్య చజలు దేశ్యములనియు సంస్కృత జన్యములుకావనియు నిర్ణయింపనగును గదా. ఈ దంత్యచజలుకొన్ని తద్భవముల యందును గూడ నున్నవని తేలుచుండుట మా వాదమునకు సాధకమే గాని బాధకము కాదు గదా. సంస్కృతమునందియ్యవి మృగ్యమనుటకు పాణిన్యాచార్యులవారే మాకుఁ బ్రమాణము. ఇఁక నియ్యవి ప్రాకృతమునందునుగూడ నున్న

వని శాస్త్ర సమ్మతము, కావునఁ బ్రాకృతములనుండి గ్రహింపఁబడిన వందురేమో ? ఈ విషయమునకు తుది ప్రకరణమున సమాధానం బీయఁబడును.

ఇఁక ద్రావిడ భాషలయందలి మూర్ధన్యములగు ట వర్గమునుగుఱించి మాటాడ వలసియున్నది. ఈ సందర్భమున ద్రావిడభాషల ప్రత్యేకతను దప్పక గుర్తింప నలవి యగును. మూర్ధన్యములు సంస్కృతభాషయందున్నవని పాణిన్యాచార్యుల వారే యొప్పుకొనిరి. ఇంతియగాక వాని యుత్పత్తిని గుఱించియుఁ దమ వ్యాకరణముననే గొన్ని సూచనలఁ జేసిరి. సంస్కృతభాష యిండో యూరపియను భాషాకుటుంబమునకుఁ జేరినదని భాషాశాస్త్రజ్ఞులుచేసిన సిద్ధాంతమును మొట్టమొదట నొసంగఁబడిన భాషాకుటుంబముల పట్టికనుబట్టి నిర్ణయింప నగును. ఇఁకఁ బయిఁ జెప్పఁబడిన మూర్ధన్యములు సంస్కృతమునందుఁ దప్ప నితరములగు నిండో యూరపియను భాషల యందు లేవనియుఁ జెప్పుట యథార్థము. అవెస్తను భాష యందుఁగూడ నియ్యవిలేవుగావున మొట్టమొదట నవెస్తను భాషయును సంస్కృతమునుగలిసి యొక్క భాషగా నుండినప్పుడును నందు లేకుండెనని యూహించు భాషా శాస్త్రజ్ఞుల యూహ సమంజసమనక తప్పదు. కావున నీ మూర్ధన్యములు వైదిక సంస్కృతమునందు హిందూదేశముననే యుద్భవించె ననుట సందర్భించుచున్నది. ఈ విషయము నిండో యూరపియను భాషాశాస్త్రజ్ఞు లందఱును నైకకంఠ్యముగా నొప్పుకొనిన విషయముగావున నద్దానిని మనమును గ్రహించుట యం దశాస్త్రీయత నొందును గానము. ఇఁక నీ మూర్ధన్యము

లెట్లువచ్చిన వనివారే చర్చించి సమాధానముల నీయఁదొడం గిరి. మొదట 'Pott' అనునాయన, పాణిని కృతమగు రషా భ్యాంణో నస్సమానపదే'యను సూత్రపుసామ్యమునఁ బ్రాచీన మగు రేఫలకారములకు వెనుక నున్న దంత్యములు మూర్ధన్య ములగు చున్నవని యూహించిరి. ఈ యభిప్రాయమునే గొంచెము మార్చి ఫార్చునేటొవ్రొగారు ప్రాచీనమగు లకారము తరువాత నున్నతకారము 'ట' కారమగుననియు రేఫ వెనుకనున్న తకారము ట్లే మారకుండు ననియు నొక సూత్రమును జేసిరి. దీనినే ఫార్చునేటొవ్రొస్‌లా అని చెప్పుదురు. ఇందుఁ జెప్పఁబడిన లకారము సంస్కృతే తరములగు నిండో యూరపియను భాషలలోని లకారముచే సూచింపఁబడెడునిండో యూరపియను లకారముగాని సాంస్కృ తికలకారముగాదు. ఉ॥ సం॥ పటుః గ్రీకు ప్లతుస్ సం॥ స్ఫట్ ఓల్డ్ హై జెర్మనుభాష. స్పల్తన్. కుఠార. లాటిను. కల్తర్. కాని యీసూత్రమున కవ్యాప్త్యతివ్యాప్తులుండుటచేఁ దక్కిన పండితులచే నియ్యది యంగీకరింపఁబడలేదు. ఇఁక నీమూర్ధన్య ముల యుత్పత్తికి పాణినిసూత్రమును, హిందూదేశ ప్రాచీన భాషలకూటమియుఁ దప్ప మఱి శరణ్యమెుండుగాన మనుట నిశ్చయము. ఉచ్చారణ సౌలభ్యముకొఱకును సౌస్వర్యమునకు నీమార్పువచ్చినచోట్ల పాణినిసూత్రము సరిపోవును. సంస్కృ తమునందలి దంత్యములు ప్రాకృతమునందు మూర్ధన్యముల గుట ప్రాకృతభాషాసహజమగు నట్ల నేకోదాహరణములచేఁ గన్పట్టుచున్నదనియు నిట్టియుత్పత్తికి ప్రాచీన హిందూదేశ

భాషలే కారణమనియు నిండో యూరపియను భాషాశాస్త్ర జ్ఞులయూహ.

ఇఁక నీమూర్ధన్యములకు ద్రావిడభాషలయందున్న స్థితిని బరిశీలింతము. ద్రావిడభాషల ధాతురూపములలో (ముఖ్యముగాఁ దమిళములో) నీమూర్ధన్యములున్నట్లు నిశ్చయముగా నెఱుఁగనగును. ఇంతియగాక యొక్కశబ్దమున దంత్యమునకు బదులుగా మూర్ధన్యమును వాడుటవలన నర్థము సందత్యంతము మార్పుగలుగుచున్నది.

కుది—గెంతు పుదై—దాచు ఎణ్—చెప్పు

కుడి—త్రాగు పుడై—గుద్దు. ఎణ్—లెక్కించు

మనై—ఇల్లు కత్తు—శబ్దించు కొత్తు—త్రవ్వు

మణై—పీట కట్టు—కట్టు కొట్టు—కొట్టు.

(ఇయ్యవి కాల్డ్వెల్లుగారిచే నీయఁబడిన పట్టికలోనివి).

పయిపదములను బట్టి మూర్ధన్యములు ద్రావిడభాషలయందనాదిసిద్ధములును సంస్కృతమునందు సౌశబ్ద్యము కొఱకువచ్చిన వనియును విదితము గదా. ఈ మూర్ధన్యములు బ్రాహ్మాయీ భాషలోఁగూడ నున్నవనుట వాని ద్రావిడత్వమును నిర్ణయించుచున్నది. ఇంతియ గాక తమిళము సంస్కృతమునుండి గ్రహించిన పదములయందలి వర్ణముల నన్నిటిని దనకుఁ దగిన యట్లు మార్చుచున్నదనఁగా కటూచ్చారణము గల వీనిని మాత్ర మేల మార్చుకొనలేదని ప్రశ్న కలుగుచున్నది. మూర్ధన్య షకారము గూడ నీ భాషోచ్చారణమున కనువుగాదు గావున ద్రావిడుల నోళ్లఁబడి మారుచున్నప్పుడు ట, డ, ణ లు మారలేదనుట కేమి హేతువు.

కావున నవి మొదటినుండియు ద్రావిడ భాషాగతములనియే నిర్ణయించుట యుక్తమనక తప్పదు. ద్రావిడ వైయాకరణు లందఱును వీనిని ద్రావిడాక్షరములుగానే లెక్కించిరనుట పయి వాదమున కుపబలము గదా. తెనుఁగుకంటె సంస్కృతపు మార్వాడీ కడనుండి యప్పుపుచ్చుకొనుటలో మిక్కిలి సంకోచించు తమిళపు బేహారికడ మూర్ధన్య యుక్తపదధనము లధికముగా నుండుటయు నా భాషల కా పదములయందుఁ గల స్వామ్యమును మఱింత దృఢపఱచుచున్నది గదా!

కావున సంస్కృతమునందు లేని వర్ణములతోఁ బ్రాచీన కాలమున ద్రావిడ భాషలుండెననియును వానిని దమకంటె ననేకవిధముల నధికమగు సంస్కృతమే గ్రహియించెననియు నిర్ణయింపనగునను నప్పుడు ద్రావిడ భాషలకు సంస్కృత భాషా జన్యత్వమును శంకించుట పటాపంచలయి పోవలసినదే గదా! ప్రాకృత భాషా జన్యత్వ మత్యంతా భావాశ్రితమేయని నుడువ నక్కఱలేదు.

ఇఁక ద్రావిడభాషలంతస్థములయందుఁ దమ ప్రత్యేకతను జూపకపోలేదు. తెనుఁగునందలి శకటరేఫమను వర్ణమునకు సంస్కృతమున మూలము గగనలిఖితంబనినచో నెవ్వరయినను గాదనఁ గలరా. 'రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః' అని నన్నయభట్టుగారి యనుశాసనమునందుగూడ ('అత్ర= ఆంధ్రభాషాయాం) కన్పించుట ద్రావిడభాషా ప్రత్యేకతకు బలకరమే యనక తప్పదు. అఱవమునందు శకటరేఫయుఁ బులిమీఁద పుట్రయనునట్లు ழ యను వేఱొక యక్షరము ను గన్పట్టుచున్నవి. ఇవి మలయాళమునందును నున్నట్లు

తెలియనగును. ఇఁకఁ గన్నడమందు 'ఱ' అను నొక యక్షర భేదము కనుపట్టుచున్నది.

దీనిపేరు 'ఱఱిమ్' అని కేశిరాజు తన శబ్దమణి దర్పణమునఁ జెప్పెను. దీని స్వరూపమును గుఱించి వ్యాఖ్యానమున "డకారం పుట్టువ తాణమం బెట్టిత్తాగుచ్చరిసె ఱఱిం పుట్టుగుం" డకారము పుట్టు స్థానమును నొక్కి యుచ్చరించిన ఱఱిము పుట్టును, అని వ్రాయఁబడెను.

ఇంతియగాఁక తమిళమున రెండు రేఫములుకూడిన జడ్డక్షరము వచ్చినప్పుడు 'ట్ర' యనునట్లు చ్చరించుట యాచారము. ఈ పయివానికన్నిటికిని మాతృకలు సంస్కృతము నుండిగాని ప్రాకృతమునుండిగాని తీసికొనివచ్చు సామర్థ్యము తపః ఫలముగాని సామాన్యము గాదనిన నినుమంతయు సత్యదూరముకాదు.

ఇఁక నక్షరములనుబట్టి సంస్కృత భాషాజన్యత్వమును గాని ప్రాకృతభాషా జన్యత్వమునుగాని ద్రావిడభాషల కంటఁగట్టుట మూర్ఖమనోరంజనమువంటిదని చెప్పవచ్చును గదా!

(ii) నామవాచకములు :—

నామవాచకములను బరీక్షించునపుడు లింగవచన విభక్తులలో సంస్కృత ద్రావిడ భాషల సామ్యావైషమ్యములను గుఱించి పరీక్షింపవలెను గావునఁ బ్రప్రథమమున లింగమును బరీక్షింతుము.

తమిళవైయాకరణులు నామములను ఉయర్ దిణై (ఉత్తమజాతి) అల్ దిణై (అధమజాతి) అని రెండుజాతులుగా విభజించిరి. ఆంధ్ర వైయాకరణులు నామములను మహత్తులనియు

నమహత్తులనియు విభజించిరనుట వ్యాకరణసిద్ధము. దీనిని గుఱించి గ్రియర్సనుగారిట్లు వ్రాయుచున్నారు. "This distinction is a peculiarity of the Dravidian languages and I do not know of any parallel in other linguistic families." ఈ విభజనము కేవలముద్రావిడ భాషలకుఁగల ప్రత్యేకలక్షణమనియు నద్దానిఁబోలినది యన్య భాషా కుటుంబములలో నెక్కడను గన్పట్టదనియుఁ బలువారి యభిప్రాయము. స్త్రీవాచకములకుఁ దమిళ మలయాళ కర్ణాట భాషలయందు స్త్రీవాచకమగు అళ్ ప్రత్యయము చేర్పఁబడుచున్నది. ఉ॥ అవళ్ అమ్మాళ్. తెనుఁగునందు స్త్రీవాచక శబ్దములకుఁగూడ నమహద్విశేషణములుఁ గ్రియలు నుపయోగింపఁబడును. ఉ॥సీతవచ్చినది. క॥ సీతె బందాళ్. త॥ సీతైవందాళ్. పురుషవాచకములకు తమిళ మలయాళ కర్ణాటకములయందు 'అన్' అను ప్రత్యయమును తెనుఁగున 'డుఞ్ప్రత్యయము'ను నుపయోగింపఁబడుచున్నవి. పశుపక్షి మృగాదులన్ని భాషలలోను నమహత్తులుగానే వాడఁబడుచున్నవి. ఏపదమున కయినను స్త్రీపుంసవాచక రూపములను సాధింపవలయుననినఁ దెనుఁగున 'ఆఁడు' 'మగ' అను వానిని, గన్నడమున 'హెణ్' 'గండు' అను శబ్దములను, తమిళమున 'పెణ్' 'ఆణ్' అను శబ్దములను బదములకుముందుచేర్చి యాయా రూపములను సంపాదింపవలయును. బహువచనంబున స్త్రీ వాచకములకును బురుష వాచకంబులకును నభిన్నములగు క్రియా రూపముల వాడుచుండుట పయిద్రావిడ భాషలన్నిటిలోఁ గలదు. ఉ॥ స్త్రీలువచ్చిరి. పురు

షులువచ్చిరి. కురుఖ్ భాషయందు మాత్రము నపుంసక బహు వచనమే స్త్రీలకుఁగూడ నుపయోగింపఁబడును.

ద్రావిడభాషలయందలి పయి పద్ధతికిని సంస్కృతము నందలి పద్ధతికిని హస్తిమశకాంతరము గలదు గదా. సంస్కృతమునఁ బదముల తుదిని స్త్రీ ప్రత్యయంబు చేర్పఁబడుటచే స్త్రీ వాచక రూపంబు సిద్ధమగుచున్నది. ఇయ్యది సామాన్యముగా, ఈ (జీప్, జీన్, జీష్) అని గాని ఆ, (టాప్, డాప్,) అనునదిగాని యుండును. ఉ॥ అజః మేక, అజా = ఆఁడుమేక. కర్తా (కర్తృ) కర్త్రీ = చేయునది. ఇంతియగాక పుంలింగాది భేదములు కేవలము వాడుకనుబట్టియే సంస్కృతమున నిర్ణయింపనగునుగాని యర్థమునుబట్టి కాదు. ఉ॥ భాషా (స్త్రీలింగము). దారాః (పుంలింగము.) కళత్రమ్ = భార్య (నపుంసకము) కావుననే సంస్కృతమున 'లింగమశిష్యం లోకాశ్రయత్వాత్' అని చెప్పఁబడినది. ఇంతియగాక కొన్ని శబ్దములు లింగత్రయముననుగూడ వాడఁబడుచున్నవి. సంస్కృత వైయాకరణులు లింగభేదము సత్త్వరజస్తమో గుణలముచేఁ గలుగునని వివరించి యున్నారు.

ఈ పయి పద్ధతిఁ గాంచినయెడల ద్రావిడభాషలు సంస్కృత జన్యములు కావను నభిప్రాయమునకు వేఱ వాచ్యత్వమును గల్పింప నక్కఱలేదు గదా !

వచనము :—ద్రావిడ భాషలయందేకవచనబహువచనములు మాత్రమే వాడఁబడుచున్నవి. ఇందు ద్వివచనము లేదు. సంస్కృత ప్రాకృత జన్యములగు నుత్తర హిందూస్థాన భాషలును రెండు వచనములనే వాడుచున్నవి. బహు వచన

ప్రత్యయమును జేర్చి దానిపయి విభక్తిప్రత్యయము నుంచుట జరుగుచున్నది.

ద్రావిడభాషలలోని బహువచన ప్రత్యయములు.— త॥ గళ్, వాడుక తమిళము. గ, ఆళ్, ఆ, ఆజ్ గ్, కన్నడము—గళు (వాడుకలో)గోళ్, గోఢ్, ల్, లా, గోండీ—క్, జ్ గ్, స్క. కూయి—గా, జ్ గాస్క, తెలుఁగు—లు, బ్రాహుయీ—ఆక్. క్. ఇది నపుంసకములపయి వాడంబడు రూపమయ్యును బుంలింగముల పయిఁగూడ వాడఁబడుచున్నది. పయి గళ్ అను రూపము గళు, కళ్, కళు అను వానితో నభిన్నమనుట యుక్తమేగదా. 'గళు' అను దానియందలి యాదిమ గకారమునకు లోపము రాఁగా అళ్, అనియు ఆళ్, అనియు సిద్ధిమగురూపము పిరామణాళ్ మొదలగు శబ్దములలో వాడఁబడుచున్నది. ఇఁక గుఱ్ఱము మొ॥ శబ్దములకు లువర్ణకము పరముకాఁగా ముువర్ణమునకు లోపమును బూర్వస్వగమునకు దీర్ఘమును వైయాకరణులు విధించిరి. కాల్డ్వెల్లు గారు మాత్రము దీనిని గుఱ్ఱ+అలు(ఆలు)అనునవి చేరుటవలన నయిన రూపముగా భావించుచున్నారు. అప్పుడు అలు, లేక, ఆలు అను ప్రత్యయముగూడ నాంధ్రము నందున్నట్లు నిర్ణయింపనగును. మొదటనున్న కకారము తెనుఁగునఁ గొన్ని శబ్దముల బహువచన రూపములయందు తప్పుగా వినఁబడినదనియు నితరరూపముల సామ్యమునుబట్టి, లువర్ణకమునే బహువచన ప్రత్యయముగా నందును గ్రహియించి రనియు గొంద ఱూహించుచున్నారు. ఉ॥ ఎలి+కళ్=ఎలికళ్=ఎలికళు=ఎలికలు=ఎలుకలు=ఎలుక+లు. గోండీ భాషలో కళ్ లోని తుదివర్ణమును

విడిచి క కారమునే,బహువచన ప్రత్యయముగా వాడుచున్నారు.
ఉ॥ నాయ్ (కుక్క) నాయిక్ = కుక్కలు.

స్త్రీపుంస సామాన్యమగు బహువచన ప్రత్యయములు, అర్, ఇర్, అరు, ఇరు మొ॥

పయి బహువచన రూపములకును సంస్కృతబహువచన రూపములకును సామ్య మే విషయమునందును లేదు గదా.

విభక్తి ప్రత్యయములు :— ద్రావిడ భాషలలో విభక్తి ప్రత్యయములు పదము తుదిని (సాధారణముగా షష్ఠీ విభక్తి రూపముపయి) చేర్పఁబడును. ఈ విభక్తి ప్రత్యయములు మొదటఁ బదములుగానే యుండి తరువాత వాడుకలో విభక్తి రూపములుగా మారి తను స్వాతంత్ర్యమును బోఁగొట్టుకొనెను. ఉ॥ తెలుఁగు నందలి ఉండి యను పంచమీ విభక్తి రూపము ఉండు ధాతువుయొక్క క్త్వార్థక రూపమేగదా, 'చేత', 'తోడ', అను తృతీయా విభక్తిరూపములు చేయి తోడు అను శబ్ద వికృతులని తేలుచున్నది గదా! పయి విభజనమునుబట్టి ద్రావిడభాషలయందలి నామవాచకముల విభక్తి రూపములు న్యాయముగా రెండు మాటలయొక్క కూడిక యని తేలక తప్పదు. షష్ఠీరూపముపయి నీమాటలు చేర్పఁబడుటచే గలిగిన మొత్తపు రూపములను న్యాయముగా సమాసములని చెప్పవలయును గదా. ఉ॥ రామునిచేత, రాముని యందు, రామ నిల్, రామఁ దెనెయింద. వాని కొఱకు మొ॥

పయివానికిని సంస్కృత ప్రాకృత విభక్తి ప్రత్యయములకును గల భేదము స్పష్టము. వీనిని నిర్ణయించుటకు వీలయి

నట్లు వానిని నిర్ణయించుటకు వీలులేదు గదా! సంస్కృత వ్యాకరణములనుజూచి ద్రావిడభాషా వ్యాకరణములు వ్రాయఁబడుటచే నీయేఁడు విభక్తుల విభాగము కలిగినది కాని లేకున్న నీపద్ధతియే ద్రావిడభాషలయందు కలిగియుండుట కవకాశము లేదు. తెలుఁగునందలి సప్తమీ విభక్తి ప్రత్యయమగు అందు శబ్దము పయియభిప్రాయమును బోధించుచున్నది. తమిళము నందీయర్థమున 28 పదములు ప్రత్యయములుగా వాడఁబడుచున్నారు. ఉ॥ కణ్, కాల్, కడై, ఇడై, తలై, వాయ్ తిసై, వయిన్. మున్, సార్, వలమ్, ఇడమ్, మేల్, కీళ్, పుఱై, ముదల్, పిన్, పాటు, అఱై, తేమ్, ఉழை, వழி, ఉళి, ఉழி, ఉళ్, అకమ్, పురమ్, ఇల్. ఇట్లే కన్నడమునందు ఉళ్, ఒళ్, ఒళు, ఒళగె, అల్, అలు, అల్లి, (ఇవియన్నియు స్వతంత్ర పదములు).

ఈ విభక్తిప్రత్యయము లేకవచనబహువచన సామాన్యములుగా ద్రావిడభాష లన్నిటియందును నున్నవి. బహువచనమును జెప్పవలసివచ్చినప్పుడు ప్రత్యయమునకును నామమునకును నడుమ బహువచన ద్యోతక వర్ణకముండును.

ఉ॥ రాము + ని + కి, రాము + ల + కు. రామ + ను + క్కు ; రామ+ర్+క్కు ; అవ+ని+గె ; అవ+రి+గె.

సంస్కృతము నందలి విభక్తి ప్రత్యయములకును, ద్రావిడవిభక్తి ప్రత్యయములకును సాదృశ్యము శూన్యమని యిదివఱకుఁ దేలినది. ఆ ప్రత్యయములు ప్రకృతులతోఁ గలియుమార్గము రెంటియందును భిన్న మనుటయును నిరూపింపఁ బడినదిగదా. ఉ॥ రమా + ఆ = రమయా; జలముచ్+

ఆ. = జలముచా, మొ॥ సంస్కృతమునందలి విభక్తిప్రత్యయ ములు. బహువచనమున వేఱును నేకవచనమున వేఱును ననుట యీక్రింది యుదాహరణమునుబట్టి తెల్లము.

ఏకవచన ప్రత్యయములు—సు (స్) ; అమ్; టా-(ఆ)

బహువచన ప్రత్యయములు—జస్ ; (అస్) ; శస్ (అస్) ; భిస్ ;

ఏభాష యందయినను, బదముల సంబంధమును దెల్పు నవియు, భాషయొక్క పరిపాటిని నిరూపించునవియు విభక్తి ప్రత్యయములుగావా. ఇట్టి క్రమ మేభాషలోనైనను ప్రాచీనా వస్థయందే యలవడి యుండవలెనుగదా. ఇఁక నిట్టి ముఖ్యమగు నంశములో భేదము గల ద్రావిడభాషలకును సంస్కృతమున కును, జన్యజనక భావముఁ జెప్పుట శశవిషాణసాధనమువంటి దనకతప్పదుగదా.

(iii) సర్వనామములు:—ఏ భాషయందైనను సర్వ నామము లత్యంతముఁ బ్రాచీనములనియును నయ్యవి మానవుని భాషసోపానములలో మొదటివియు ననుటలో నెవ్వరికిని నభి ప్రాయభేదముండదు. ప్రపంచమునందలి సర్వవిజ్ఞానమునకును 'అహమ్' అనునదియే మొదటివిత్తనము. తత్ త్వమ్ పదార్థ ములను బోధించుటకే శ్రీ శంకరాచార్యులవారి ప్రయత్నము గదా. ఎట్టి జీవునకయినను, నేను, నీవు, అది, అనుభావములు మొదటఁ గలుగును గావున నందేమయినను సంస్కృతమునకును ద్రావిడభాషలకును సామ్యముగలదేమో పరీక్షింతము.

ఉత్తమపురుషైక వచనము:—త॥యాఁ, నాఁ. మల॥ ఞాన్. తె॥ ఏను, ఏ, నేను, నే, క॥ యాఁ, ఆన్, నాను నా.

తుళు॥ యాఁ. కూర్గు॥ నఁ. గోండ్॥ అన్నా. కూ॥ ఆను. తుద॥ ఆఁ. కోట॥ ఆనె, రాజమహల్॥ ఎన్. ఒరయాన్॥ ఎఁ.

ఈ పయి భాషలన్నియు నొక కుటుంబమునకుఁ జేరిన వని యభిప్రాయముగావునఁ బయిపదములకన్నిటికిని మూల రూపమనఁదగున దెయ్యది యను విషయమును దొలు దొల్త మనము పరీక్షింపవలయును. ఈ పయిరూపములలో ఆన్, నాఁ, యాఁ, అను మూఁడు ముఖ్యరూపములు కన్పట్టుచున్న వని చెప్పనగును. ఎన్, అనియును ఏఁ అనియును నున్నరూప ములనెట్లు సమన్వయింప వచ్చునను ప్రశ్న కలుగవచ్చును. అకారము, ఎకారముగా మారుట ద్రావిడభాషా స్వభావ ములో నున్నదిగావునఁ దత్తద్రూపములలోనున్న 'ఎ' కార ముల నా పద్ధతిపయి సమన్వయింప నగును. ఉ॥—సం॥ జపను (త) శెబమ్; బలమ్, బెలమ్. శల్యుఁడు (స) సెల్లుఁడు. (తె) శపించు (స) సెపించు. (తె). ఇఁక ఆఁ, యాన్, నాన్, అనురూపములలో నెయ్యది ప్రాచీనమో నిర్ణయించుట కష్టమగుపని. కొందఱు, ఆన్, ప్రాచీనమనియు, మరికొందఱు, యాఁ, ప్రాచీనమనియును, నింకఁ గొందఱు నాఁ అనునదే మొదటిరూపమనియును వాదించుచున్నారు. ఆఁ అనునది మొదటి రూపమయి యుండుననియు, నది 'యాఁ' అను రూపమున నుచ్చారణమునఁ బొందియాను నాసిక్యమున ఞాఁ అను రూపమునుదాల్చి యనంతరము 'నాన్' అయియుండ వచ్చునని కాల్డ్వెల్లుగారి యూహ. యకారాదికములగు శబ్దములు నకారాదికములుగా మారుట గలదు. ఉ॥ యమః (సం). నమఁ (త); యుగమ్ (సం)

నుగమ్ (త) నొగ (తె). ఆ౯, అను రూపమే ప్రాచీన మను టకు సర్వనామమునందలి (నా౯ అనునది) తొలినకారము క్రియాప్రత్యయములలోఁ ద్రోసివేయఁబడుట మిక్కిలియు నుప బలముగానున్నది. ఉ॥ క్రియాప్రత్యయములు. త॥ ఎ౯ ఏ౯, అ౯ మొ॥ తెనుఁగునం దియ్యవి నకారయుక్తముగానే యున్నవి. (ను, ని.) ఇవిగాక గోండ్‌లో నొక్క రూపము 'న' అనునది తప్ప మఱి యేద్రావిడ భాషయందును (కాల్డ్వెల్లు గారి పట్టికలో) క్రియా ప్రత్యయమున, నకారాదికమగు రూపము లేదు.

నా౯ శబ్దమునందలి తుదినకారము పురుషబోధకమును వచనబోధకమునునని యూహింపనగును.

మధ్యమ పురుషైకవచనము:—త॥ నీ, నీయ్. మ॥ నీ. తె॥ నీవు, నీ, ఈవు—క॥ నీ౯, నీ, నీను. తుళు॥ ఈ. కూర్గు ని౯. గోండ్ ॥ ఇమ్మా. కు॥ ఈను. తుద॥ నీ. కోట॥ నీ. రాజమహాలు॥ నిన, ని౯. ఒరయాన్॥ ని౯, నీ ఎ౯. బ్రాహూయి॥ నీ.

ఈ శబ్దముయొక్క ద్వితీయాది విభక్త్యంగము ద్రావిడ భాషలన్నిటిలో 'న'కారముతోడనే యొప్పుచున్నది. తమిళము నందు మాత్రము ని౯, ను౯ అను రూపములతోఁగూడ 'ఉ౯' అనురూపము కన్పించుచున్నది. ఇఁక నీ౯, ఈ౯, అను రూపములలో నెయ్యది ప్రాచీనమను విషయమును కాల్డ్వెల్లు గారు పరిశీలించుచుఁ దుదినకారము వచన బోధకమనియుఁ దొలినకారము త్తమపురుష సర్వనామమునందు వలెనే యిం దును వచ్చినదనియు నూహించుచున్నారు. కాని యిందు

‘నీ’ యను నదియే మూలరూపముకావచ్చునను ననుమానము మాత్రము నాకింకను బోలేదు. అన్ని భాషలయందును (తెనుఁగునందలి ఈవు రూపమునందును తుళు, కు భాషల యందలి, ఈ, ఈను, అను రూపములనుదప్ప) ఈ సర్వనామము నకారాదిగానే గనఁబడుచున్నది. ఇంతియుకాక యకారమును నాసిక్యమును దాల్చి ‘నీవు’ అయినదని చెప్పుట కిందు, ‘యీవు’ అను రూపమెక్కడను లేదుగదా! ఇంతకును నీ విషయము నిదమిత్థమని నిర్ణయించుట కష్టము.

బహువచన రూపములు:—ఉత్తమపురుష బహువచనమునకు మేము, మనము, అనునట్టివి రెండు రూపములు తెలుఁగులోఁ గన్పట్టుచున్నవి. ఒకరూపమునం దెదిరి గ్రహింపఁబడును. రెండవదానిలో నట్లుకాదు. ఇట్టి రూపభేదమ యిదు ద్రావిడ భాషలలో నున్నది.

| తెలుఁగు. | తమిళము. | మలయాళము. | కురుఖ్ | కూయి. |
|---|---|---|---|---|
| మేము | నాంగళ్ | నజ్ఞళ్ | ఏమ్ | ఆము |
| మనము | యామ్, నామ్ | నామ్ | నామ్ | ఆజు |

ఈ రూపద్వయము కన్నడము, గోండీ, బ్రాహూయీ, యనెడు భాషలలో లేదుగావునను ముండాభాషలలోఁ బ్రబలముగా నున్నదిగావునను నియ్యది ద్రావిడ భాషలలోని కా భాషలనుండి వచ్చినదని గ్రియరుసనుగా రూహించుచున్నారు. కాని యీ మతమును మే మొప్పుకొనఁజాలము. పయి మూఁడు భాషలయందును బ్రాహుయీభాష యన్యభాషా సంపర్కము విశేషముగా గలదిగావునను దక్కిన ద్రావిడ భాషలనుండి పెద్దకాలమునకు ముందు వేఱుపడి

నదిగావుసను నం దీభేదముండకపోవుట యొక బాధకముగాదు. ఈ ద్వివిధ బహువచనరూపములు ముండా భాషలనుండి ద్రావిడభాషలకు వచ్చియుండవచ్చునను నెడల ముండా భాషలను మాటాడు జాతివారితోఁగలిసి జయపురపు ఏజన్సీ ప్రాంతముల నివసించు గోండీవారిభాషలోని కేలరాలేదు. ముండా భాషలుమాటాడు సవరలు, గదబలు, సంతాలీ మొదలగుజనులకుఁదక్కిన ద్రావిడభాషల వారందఱికంటెను వీరే సమీపస్థితిలో నున్నారనుటయు వీరి వాదమున కెంతయు బాధకము. అయిన యెడల గోండీ భాషలో నీ భేదము పోయి యుండుటకుఁ గారణమేమనఁగా నాభాష యనేకములగు నార్యభాషల త్రొక్కుడికినణఁగిపోయి క్షీణించుచున్న దనుటయే కారణము. మొదట నాభాష మాటాడు వారనేకు లుండియు నిప్పుడెట్లు తక్కువయయిరో, యట్లే పయిభాషలరాపిడి యీవాడుకనుగూడఁ బోఁగొట్టి యుండవచ్చును. ఇఁకఁ గన్నడమునందుఁదప్ప తక్కిన భాషలన్నిటియందును నియతముగా నీభేదమున్నది గావున నియ్యది ద్రావిడభాషాస్వభావమనియే మాయభిప్రాయము.

ఆత్మార్థకసర్వనామము.

తెలుఁగు, తమిళము, కన్నడము, మలయాళము, కురుఖ్ మొ॥ భాషలన్నిటి యందును బయి సర్వనామ ముపయోగింపఁబడుచున్నది. తాణ్, తాను, తమ్, తమరు, తా, మొదలగు రూపములతో నియ్యది కన్పించుచున్నది. వీనికన్నిటికిని 'తా' అని గాని 'త' అని గాని మూలరూపముండ వలయును. ఈశబ్దము నుండియే తెనుఁగులోని భావార్థకప్రత్యయము 'తనము' అనునదియు, తమిళమునందలి 'తన్మై' యనునదియుఁ బుట్టియున్నదని

యు కాల్డ్వెల్లు గారూహించుచున్నారు. ఈ 'తన' శబ్దము సంస్కృతమునందలి స్వయమ్ శబ్దమువంటి యర్థములోనే యుపయోగింపఁబడు చున్నది. ఇయ్యది భావదృఢీకరణముకొఱకు (Emphasis) నుపయోగింపఁబడిన నిర్దేశక సర్వనామము (Demonstrative Pronoun) కావచ్చుననియు నట్టి సర్వనామములవాడుక సితియను భాషలయందును, ఇండో యూరపియను భాషలయందును నున్నదనియుఁ గావున నెవ్వరమునను దీని నా రెండుభాషాకుటుంబములయొక్క సామ్యముగలదానిగానూహింపఁదగుననియు వ్రాసి యియ్యది యొకప్పుడు సంస్కృతశబ్దముయొక్క పోలికపయి వచ్చియుండిన నుండవచ్చును గాని దానినుండి పుట్టినదనుట మాత్రము తమయభిప్రాయముగాదని కాల్డ్వెల్లుగారు వ్రాసిరి. ఈ 'తత్' శబ్దమార్యులకును సితియనులకును సమానముగాన నిక్కడ ఇండో యూరపియన్ కుటుంబమునుండియే యియ్యది ద్రావిడ భాషలంజేరినదని చెప్పుటకు వినిగమన యేమియును లేదు.

ఇది యీభాషలను మిక్కిలిగా వ్యాపించి యనేకపదముల యందేర్పరుపరాని యంగముగా నుండుటనుబట్టి చూడఁగా నిది ద్రావిడభాషాపద మేమోయని తోపకతప్పదు.

నిర్దేశకసర్వనామములు :—ఈ సర్వనామములయొక్క క్రింది రూపములన్నియును తమిళరూపములు. తక్కిన భాషలందలి రూపములన్నియును దీనితో మొత్తముమీద సరిపోవును గనుక వాని నుదాహరింపలేదు.

இவன். அவன். உவன். எவன். (யாவன்)
(వీఁడు) (వాఁడు) ఎవఁడు.
இவள். அவள். உவள். எவள். (யாவள்)
(ఈమె) (ఆమె) (ఏయమ)
இது. அது. உது. எது. (யாது, யாவது).
(ఇది) (అది) (ఏది)
இவர். அவர். உவர். எவர். (யாவர்)
(వీరు) (వారు) (ఎవరు)
இவை. அவை. உவை. எவை (யாவை)
(ఇవి) (అవి) (ఎవి)

తమిళ కర్ణాటమలయాళముల మూఁడిఁటియందును బయిశబ్దము లొక్కరూపముననే యున్నవిగాన నవి వేఱుగా నియ్యఁబడలేదు. పయిశబ్దముల నన్నిటినిఁ బరీక్షింపఁగా వీని మూలరూపములు, అ, ఇ, ఎ, ఉ, అనునవి యని సిద్ధాంత మగుచున్నది. పదమునందలి మిగిలిన వర్ణములన్నియు రూప సిద్ధికిని, సంధికొఱకును, నుచ్చారణసౌకర్యముకొఱకును, లింగ బోధకములుగాను వచ్చినవని తేలకతప్పదు గదా! పయిఁ జెప్పఁబడినవియే మూలరూపములనుట, ఇప్పుడు మొదలగు కాలవాచకములవలనను, అల్ల, ఇల్ల, ఉల్ల మొదలగునట్టి నిర్దేశ వాచకములచేతను దృఢీకరింపఁబడుచున్నది. 'ఉ.' అనునట్టి రూపము దూరమునకును, దగ్గఱకును మధ్యస్థితినిబోధించు చున్నది. ఇట్టివాడుక భారతమందు నన్నయభాగములోనున్న 'ఉల్ల' యను నొకప్రయోగమునందుఁదక్క మఱియొక్కడను

నేనుజూడ లేదు. ఆ, ఈ, ఏ, లు త్రికములని యాంధ్రవైయా కరణులచేఁగూడ నేర్పరుపఁబడినవి.

ఇట్లు విభజింపఁబడిన సర్వనామముల మూలరూపము లకు సంస్కృతముతో నేమైనను బోలికలున్నవా యను విష యమును విచారింపవలయును.

మధ్యమోత్తమ పురుష సర్వనామముల మూలరూప ములు 'ఈ' 'ఆ' అని కాల్డ్వెల్లుగారి సిద్ధాంతముగావున వారి మతమున సంస్కృత సర్వనామములతోఁ బయివాని కేమయి నను సంబంధమున్నదాయని చర్చింపవలయును. ఇండోయూరపి యనుభాషల యుత్తమ పురుషైకవచనమునకు రెండుమూల రూపములున్నట్లు తెలియవచ్చుచున్నది. సంస్కృతమున అహమ్ అనునది ప్రథమావిభక్తి రూపము, ద్వితీయాది విభక్త్యంగము, మశబ్దము. ఉ॥ మామ్, మహ్యాం, మే. మొ॥ అట్లేఆంగ్లమునఁ గూడ 'ఐ' అనునది ప్రథమావిభక్తి రూపము. మి, మై. మైన్ ఇత్యాదులయందు 'మ' యనునదియే మూలరూపముగా నున్నది. ఇఁక నిండో యూరపియన్ 'అహమ్' శబ్దమునకును ద్రావిడభాషల 'ఆ' శబ్దమునకును సంబంధములేదని చెప్ప వలెను. కారణమేమనఁగా 'అహమ్' అనునది 'అఘ' అను నొక కంఠ్యముతోఁగూడిన ప్రాచీనరూపమునుండి వచ్చినదని యూహింపనగును. అప్పుడు, అఘమ్ అను దానికిని, 'ఆ' యను దానికిని సామ్యమే లేక పోవునుగదా. ఇఁక నిండో యూరపియను 'మ' శబ్దమునుగుఱించి యోచింతము. ఈ భాషలయందు, 'మ' కారము కొన్నిచోట్ల 'న' కారముగాను

గొన్నిచోట్ల 'వ' కారముగాను మఱికొన్నిచోట్ల 'అ' కారము గాను మారుటకలదు.

నకారమగుటకు॥ ఉ॥ సం॥ ఆసమ్. గ్రీకు-ఏన్. సం॥ అదదమ్, గ్రీ॥ ఎదిదోన్. సంస్కృతమునందలి యాదిమ మకారముగూడ నిట్లే నకారమగు చున్నది. మస్ (సం) ఇది ప్రథమా విభక్తి ప్రత్యయము. లాటిను 'నోస్' ఈమూర్పు సంస్కృతమునందలి 'నః' అను షష్ఠీరూపములోఁగూడఁ గన్పట్టు చున్నది. మకారము 'అ' కారముగా మారుననుటకు ఉ॥ అస్మే (సం) = అ+స్మే యుష్మే=యు+స్మే. ఈ 'స్మే' యను నది బహువచన సూచకము. అస్మే యనునది మొదట మస్మేయయి యుండవలయును. ఈపయి వాదమునుబట్టి యిండో యూరపియను మశబ్దమునకును, ద్రావిడుల, 'న' లేక 'అ' శబ్దములకును సంబంధముండవచ్చుననియు సితియను సర్వ నామరూపములయందుఁగూడ 'మ' శబ్దమేయున్నది గావున నీ 'మ' శబ్ద మొక్క యార్యభాషల కాణాచియేగాక సితి యనుభాషలకును జేరినదేగావున నీమూఁడు భాష లెప్పుడో యొకప్పుడు కలసియున్నప్పుడే ద్రావిడసర్వ నామములు విడిపోయియుండ వచ్చుననియును కాల్డ్వెల్లు గారి సిద్ధాంతము.

ఇఁక నిండో యూరపియను భాషలయందును సితి యను భాషలయందును, 'తు' శబ్దము మధ్యమపురుష సర్వ నామ ప్రధానాంగము. అయ్యది 'ను' శబ్దముగామారి యీ ద్రావిడ సర్వనామమునకు మూలమయి యుండవచ్చును. తకారము నకారముగా మారుననుట కుదాహరణము. సం॥ తే. పాళీ॥ నే; సం॥ తా, పాళీ=నా; సం॥ తాని. పాళీ (నాని)

సం॥ ఏతమ్, ఏనమ్. ఇట్టి మార్పు సితియను భాషలందును, ఇండో యూరపియను భాషలందును , వచ్చియుండఁ దగినది గనుక నియ్యది యీ మూఁడు భాషలును నొక్క కాలము ననే విడియుండినట్లు సూచించుచున్నదని కాల్డ్వెల్లుగారియూహ. పయివాదము కాల్డ్వెల్లుగారియొక్క జ్ఞాన వైశాల్యమును ప్రతిభా విశేషమునుఁ జాటినఁ జాటవచ్చును గాని సాధారణులకు మాత్ర మింతదూరము పోవుటయందు సత్యము న్నట్లగపడదు. ఇంతకును భాషలయొక్క పుట్టుకకు సంబంధించిన యా ప్రాథమికావస్థలో నేమియుండెనో యూహించుటకుఁ బయి యుక్తులు చాలవేమో. ఇఁక ద్రావిడ సర్వనామ మూల రూపము లొకటి 'నా' ఇంకొకటి 'నీ' యనియును నుండును గాని కాల్డ్వెల్లుగారు చెప్పినట్లు ఆ, ఈ, అనునవి కావని మా యభిప్రాయము. వీనికి సంస్కృత సర్వనామములతోఁ బోలిక లేదు గావున మనమా భాషలకు సంస్కృత జన్యత్వమును శంకింప నక్కఱ లేదని మా యభిప్రాయము.

ద్రావిడ భాషలయం దుత్తమ పురుష సర్వనామమునకు రెండు బహువచన రూపము లుండుట వీనికి సంస్కృత భాషా జన్యత్వ కల్పనము నొనర్చుటయందు దాటరాని ప్రతిబంధము గదా.

ఇఁక 'తన' శబ్దము సితియను భాషలకును నిండో యూరపియను భాషలకును సంబంధించినది గావున నీ సందర్భములో కాల్డ్వెల్లుగారి యభిప్రాయమే సరియగునని యూహ కలుగవచ్చును. కాని యియ్యది భాషలో ననేక రూపము

లలో వ్యాపించియుండుట స్వతంత్ర ద్రావిడ భాషా రూపమే యయి యుండవచ్చునని మా యభిప్రాయము.

ఇఁక నిర్దేశక సర్వనామములయందు అ, ఇ, ఉ, ఎ అనునవి మూలరూపములని ముందు నిర్ణయించితిమి గదా. ద్రావిడ భాషలలో నీ రూపములన్నియు సరిగాఁ గుదిరినట్లు మఱి యే భాషయందును గుదురలేదు. మొదట నిచ్చిన పట్టిక యందును అక్కడ, ఇక్కడ మొదలగు శబ్దములయందును నీ నాల్గు పదముల మూలరూపములును నిస్సంశయముగాఁ గన్పట్టుచున్నవి. ఇట్లు రూపము మారకయొక్క శబ్దమునందైనను దప్పక యివి యుండుట యెంతయును విచిత్రము. సంస్కృతమునందు, ఇహ, ఇదానీమ్, ఇదమ్ మొ॥ శబ్దములలో సామీప్యమును బోధించుటకు 'ఇ' కారమును దూరమును బోధించుటకు, అదః అత్ర, తత్ తదానీమ్. మొ॥ శబ్దములయందు కొన్నిచోట్ల 'అ' కారమును మఱికొన్ని స్థలములందు 'త' కారమును బ్రయోగింపఁబడుచున్నవి. ఈ 'అదస్' శబ్దము దగ్గఱనే గాక దూరమునుగూడ బోధించుచున్నది. ద్రావిడమందలి, 'ఉ' శబ్దమునకు మూలము సంస్కృతమునందు లేదు. 'ఎ' శబ్దమునకును నీ యర్థమునందు సంస్కృతమున నుపయోగింపఁబడు 'కిమ్', కః మొదలగువాని 'క' కారమునకును సభిన్నత వంధ్యా పుత్త్రునివంటిదనుట నిర్వివాదము. 'అ'. 'ఇ' అను శబ్దములు సంస్కృతమునందును, ద్రావిడ భాషలలోను, సితియను భాషలలోను నల్పములగు సాదృశ్యములతో నుండుట యా భాషలకుఁ బ్రాచీనమగు

సంబంధ మున్నదనువారి వాదమున కుదాహరణముగా నొసంగుచున్నారు.

పయి యుదాహరణముల నన్నిటినిబట్టి ద్రావిడ సర్వనామములకును సంస్కృత సర్వనామములకును జన్య జనక భావమున్నదో సోదర భావమున్నదో యేభావమును లేదో పాఠకులకే తెలియంగలదు.

సంబంధబోధక సర్వనామము :—(Relative pronoun.) ద్రావిడ భాషలయందుఁబయి సర్వనామములవాడుక లేదనుట భాషా స్వభావమెఱిఁగినవారికిఁ జక్కఁగాఁ దెలియునుగదా. 'యఆగతఃసః' అను సంస్కృతముతో సమానార్థకమగు (He) who has come అను నాంగ్ల వాక్యమునందలి యర్థమును దెలుపుటకు 'వచ్చిన వాఁడు' అను పదమున నున్నట్లు క్రియాజన్యవిశేషణమును ద్రావిడభాషలోఁ బ్రయోగింతురుగదా! ఈ పద్ధతి సంస్కృత ద్రావిడభాషలకు హేతు హేతు మద్భావమును సాధించుటకుఁ బ్రబల విరోధికాదా. ఇట్టి వాడుక ద్రావిడ భాషలలోఁ బ్రాచీనస్థితిలో మృగ్యమయినను గొన్నిస్థలముల యందు మాత్రము సంస్కృత భాషా సంప్రదాయావలంబనముచే వచ్చినదని యూహింపనగును. ఉ॥ ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపఁ డిందు మొ॥. ఇది కేవలము నవీనము. అప్పుడప్పుడు వాడుకయందును నిట్టిది (పయి పద్ధతినే వచ్చి చేరినది.) కనబట్టుచున్నది. ఇట్టి యభ్యాస మార్యభాషల మూలమున గోండీభాషలోనికిని వచ్చినదని తెలియవచ్చు చున్నది. పయి విషయమున సంస్కృతపు బద్ధతికంటె ద్రావిడ

భాషలయందలి పద్ధతి యెంతయు లాఘవమును గలిగి యున్న దనుట నిశ్చయముగదా. భాషా స్వభావమునఁ బాతుకొనిపోయి నిరంతర ముపయోగింపఁబడుచున్న పయి క్రమమునుబట్టి ద్రావిడభాషలకును సంస్కృతభాషలకును భిన్నములగుజన్మకారణముల నూహింపక నవీనమును గౌరవ క్రమమునునగు నీసంబంధ బోధక సర్వనామక్రమము నాధారముఁ జేసికొని పయి భాషలకు జన్యజనక భావమును సాధింపఁబూనుట పురస్స్థితంబగు ఘంటాపథంబును వీడి కంటకవ్యాప్త తరులతాగుల్మావృత ప్రదేశమునం జొఁరబడుట వంటిది కాదని యెవ్వరనఁగలరు.

(IV) సంఖ్యా వాచకములు:—మానవుల నిత్య వ్యవహారమునకు సంఖ్యావాచకము లత్యావశ్యకములుగాన నయ్యావిభాషయొక్క ప్రాథమికావస్థయం దుండవలసిన యంగములనుటలో నభిప్రాయభేదముండదు గదా! ఇఁక నట్టి సంఖ్యావాచకముల స్వభావమును వానికి సంస్కృత భాషామూలకత్వమును నెంతవఱకుఁ జెప్పనగునో పరీక్షింతము. ప్రకృపట్టికలోనిశబ్దములనన్నిటిని బరీక్షించినయెడల రెండు విధములగు సంఖ్యావాచక శబ్దములు పయి ద్రావిడ భాషలలో నున్నట్లు పాఠకులకుఁ దెల్లముకాక తప్పదు. ఒకవరుస సంస్కృతభవములు. రెండవ వరుస ద్రావిడ భాషారూపములు. మాల్తో భాషయందు ఒకటి, రెండు శబ్దములు తప్పఁ దక్కిన వన్నియును సంస్కృత జన్యములనుటలో వివాదము లేదు. బ్రాహూయీభాషయందలి రూపములు—అసిట్. ఇరట్. ముసిట్, చార్, పఞ, షస్, హఫ్త్. హష్, నొహి. దహ. ఈ పదింటియందును రెండు మూఁడు ఒకటియుఁ దప్ప దక్కిన వన్ని

| తెలుఁగు. | తమిళము. | మలయాళము. | కన్నడము. | కురుఖ్. | మాల్తో. | కూయి. |
|---|---|---|---|---|---|---|
| ఒకటి.<br>ఒండు. | ఒన్రు. | ఒరు. | ఒందు. | ఒంటా. | ఒర్తు. | ఏక. |
| ఒక. | ఒరు.<br>ఓర్. | | | ఓర్ట్. | | |
| రెండు. | ఇరండు. | రండు. | ఎరడు. | ఎండ్. | ఇవర్. | రిండి.<br>దుయి. |
| ఇరు. | ఇరు<br>ఈర్ | | | ఇర్బ | | |
| మూఁడు | మూన్ఱు | మూన్న. | మూరు. | మూండ్. | తీన్ | మూంజి<br>తిని |
| మూ | మూ, ము. | | మూ. | నుబ్. | | |
| నాలుగు.<br>నలు | నాలు.<br>నాంగు.<br>నాల్. | నాలు. | నాల్కు.<br>నాల్. | నాఖ్.<br>నాయిబ్. | చార్. | నాల్గి.<br>సారి. |
| ఐఁదు.<br>ఏ. | ఐందు.<br>ఐమ్. | అంజు. | ఐదు.<br>ఐ. | పంచే. | పచ్. | సింగి.<br>పాసు. |
| ఆఱు.<br>అఱు. | ఆఱు.<br>అఱు. | ఆఱు. | ఆరు.<br>అరు. | చొ. | ఛో. | సజ్గీ.<br>సా. |
| ఏడు. | ఏళు.<br>ఎళు. | యేళు. | ఏళు. | సాత్తె. | సాత్. | ఒడ్గి.<br>సాతు. |
| ఎనిమిది. | ఎట్టు.<br>ఎణ్. | యెట్టు. | ఎంటు. | ఆఠ్. | అట్. | ఆటు. |
| తొమ్మిది. | ఒన్బదు. | ఒన్బదు. | ఒంబత్తు. | నొ. | నో. | నా. |
| పది. | పత్తు. | పత్తు. | హత్తు | దస్సే. | దస్. | దసు. |

యును సంస్కృత జన్యములు. కూయి భాషయందలి మొదటి నాలుఁగు శబ్దములు తప్పఁ దక్కిన వన్నియు సంస్కృత భవములు. కూయి భాషయందు మొదటి యేఁడు శబ్దములయందును ద్రావిడ శబ్దములును, సంస్కృత శబ్దములును గూడ వాడఁబడుటను బయిపట్టికవలనఁ గనుగొననగును. ఇఁక ద్రావిడ భాషలయందుఁ బ్రధాన భాషలగు నాంధ్ర తమిళ కర్ణాట మలయాళములలోని పదములన్నియును ద్రావిడ పదములనుట జిజ్ఞాసువులకుఁ దెల్లము కాకపోదు. ఇఁక ద్రావిడ శబ్దములనంబడు పయివాని తత్త్వమును బరీక్షింతము.

పయి ద్రావిడ సంఖ్యావాచకములు విశేషణములుగాను విశేష్యములుగాను గూడఁ బ్రయోగింపఁ బడుచున్నవి. ఉ॥ నాలుగు కాయలు. ఇచ్చిన నాలుగు. ఈ విశేషణములయందు రూపభేదములున్నట్లు పయి పట్టికవలననే తెలియనగును. ఈ విశేషణ రూపములన్నియును బ్రాచీన రూపములనియు విశేష్యరూపములు వానినుండి వచ్చినవనియు నూహింపవలసియున్నది. విశేషణరూపములకు నపుంసకలింగ బోధకమగు 'దు' ప్రత్యయమో మఱియే యితర ప్రత్యయమో వచ్చిచేరుట వలన విశేష్యరూపములు కలుగుచున్నవి.

ఒర్ +దు—ఒకొండు. ఒన్టు. ఇరు. ఇర్ +దు—ఇరండు; 'ఎరడు' శబ్దముయొక్క మొదటి వర్ణములకు వ్యత్యయము రాఁగా రెండు అగుచున్నది. ఇరు అను విశేషణరూపము, ఇరువరు, ఇబ్బరు, ఇరువది మొ॥ పదములలోనున్నది. మూ+దు—మూండు. మూన్టు, మూఁరు. నాల్ +కు (గు)-నాల్గు. నాక్కు-

నాంగు. అయి+దు-అయిందు. (అంజి.) అయిదు. అఱు— ఆఱు ఎళు— ఏళు. ఏడు.

పయిని జూపించిన యేడు శబ్దములయందును మొదటి యయిదు శబ్దములలోఁ గూడ విశేషణరూపమున కొక ప్రత్యయము చేర్చుటవలనను, దక్కిన రెండు శబ్దములయందును విశేషణ గతమగునచ్చును బొడిగించుటచేతను విశేష్యరూపము లేర్పడుచున్నవనుట తెల్లము. మొదటి యయిదుశబ్దములలో నాలుగు శబ్దమున 'గు' ప్రత్యయమును దక్కినవానికి 'దు' ప్రత్యయమును జేర్పఁబడుచున్నవి. ఈ 'గు' ప్రత్యయము ద్రావిడధాతువులకు సాధారణముగాఁ జేర్పఁబడుటచే తెలుఁగు నందలి శబ్దములగుట సుప్రసిద్ధము. ఉ॥ తిరి+కు=తిరుగు, వెరు+కు-వెరుగు. మొ॥. ఈ యయిదుశబ్దములందుఁ ప్రత్యయములు చేరునప్పుడు నడుమనొక నకారము వచ్చుటచే నారూపములు కలిగినవనుటయుఁ జూచినవారికిఁ దెలియఁగలదు. ఈ 'న' కారము సాధారణముగా ద్రావిడభాషలయందుచ్చారణ సౌలభ్యముకొఱకు వచ్చుచుండుననుట సుప్రసిద్ధము. ఉ॥ అడ+కు+అడంగు. (త) కాయ్+కు-కాఁగు. కాఁక. పగు. (త)= పంచు, పంగు=భాగము. అ+గు=అంగు, ఇ+గు=ఇంగు. ఎ+గు= ఎంగు. (త). తిరు+దు=తిరుందు. (త). మరు+దు=మరుందు (త). (అర్థము-మందు). మొ॥ ఈయభ్యాసము ద్రావిడభాషల యందు మిక్కిలియు బహుళముగానున్నది. ఇఁకఁ బయివిశేషణ రూపములపయి నకారము రాఁగాదానిమీద 'దు' ప్రత్యయము వచ్చినతరువాతఁ బయి విశేష్యరూపములు కలుగు

టలో నేమియు ననుపపత్తిలేదు. బిందుపూర్వక దకారమునకు డకారము రాచ్చును.

ఇంకంబయి శబ్దములమూలములను జర్చించి వానికి సంస్కృతభాషా జన్యత్వమున్నదేమో నిరూపింతము. ఒర్+ఞ+దు-ఒన్దు, ఒన్ద్రు, ఒన్ఱు, ఒందు. తమిళమున. కిఱు అను క్రియలపయివచ్చు నాగమమునకు కిన్ఱు అను రూపముగలుగు చున్నది సెయ్‌గిరేన్=సెయ్‌గిన్ద్రేన్. ఇట్లే కరు శబ్దము (వెయ్యి) కన్ద్రు, అనియు కణ్ణు అనియు మారుచున్నది. ఆడు శబ్దము, (అండు) అనియు నగుచున్నది. ఈపద్ధతినే మూన్ద్రు, మూండు, మూఁడు, అను శబ్దములు కూడఁగలిగినవి. ఈపయి క్రమమును బరీక్షింపక యొక్క రీనడుమ నకారము వచ్చుటకు మార్గము కాల్డ్వెల్లుగారు వచియింపలేదనియు ఒర్ అనునది ప్రాచీనరూపముగాదనియు, ఒఞ, అనునదియే ప్రాచీనరూపమనియు వచియించిరి. ఒఞ ప్రాచీనరూపమగునెడల నయ్యది విశేషణరూపముగా నేల వాడఁబడలేదు. ఒరువన్, ఓర్వాళు, ఒత్తరు = ఒత్తరు, మొదలగు రూపములన్నిటి యందును ఒర్ అనునదియే విశేషణరూపముగా నున్నదనుట పరీక్షకులకుఁ దెల్లమేగదా. నకారము వచ్చెననుట మొదటి యయిదు శబ్దములకు సామాన్యమనియు నయ్యది ద్రావిడ భాషా సంప్రదాయమనియుఁ బయిని నిరూపింపఁబడినదిగదా. పోనిండు ఒఞ శబ్దమే ప్రాచీనమను కొందము. అట్లయినయెడల ఒఞ + ద్. నడుమ రేఫమెట్లు వచ్చినది. ఈ సందర్భములో రేఫముకంటె నకారము వచ్చినదనుట ద్రావిడ భాషా స్వభావమనుట యుక్త

మని పయి యుదాహరణముల వలనఁ దేలదా! అట్లు 'ఒక' అను శబ్దమును ప్రథమముగా నిరూపించినప్పు డద్దాని నిండో యూరపియను భాషలలోని లాటినునందలి 'ఉనస్' (ఓ ఇనస్ అనునది ప్రాచీనరూపము.) అను శబ్దముతో సమన్వయము చేయుట గదా! ఫలము. అట్లు చేయుటగూడ సిద్ధించెననుకొంద ము. సితియనుభాషలకు సంబంధించిన సామోయెద్ భాషాభేద ములలో నొకదానియందు ఉనెమ్, అనియు, తుంగుసియను, మంచు భాషలలో - ఉమ్, ఎము అనియు రూపములు గలవు గదా. అప్పుడు ద్రావిడుల 'ఒక'శబ్దమును సితియను భాషలకుఁ జేర్పక యిండో యూరపియను భాషలకుఁ జేర్చుటయేల. ఈ మూఁడిటికిని సంబంధము పెద్దకాలము క్రిందఁ గలదను కాల్డ్వెల్లుగారి వాదమే ఘట్టకుటీప్రభాతన్యాయమున సమాశ్రయ ణీయమగును గదా. ఇఁక సంస్కృతమునందలి 'ఊన' శబ్ద మునకుఁ బయి 'ఒక' శబ్దము నంటగట్టుటకుఁగూడఁ బ్రయత్నము జరుగవచ్చును. ఊన శబ్దమునకు సంస్కృతము నందుఁ దక్కువ యని యర్థముగాని 'ఒక' యను నర్థములేదు. ఊనవింశతి మొదలగు పదములలో లక్షణాసమాశ్రయణము నంజేసి యౌపచారికముగా 'ఊన' శబ్దమునకు 'ఒక' యను నర్థమును గల్పింతురేమో! కల్పింపనిండు. అప్పుడు లాటిను శబ్దమగు 'ఉనస్,' అనునదియు సంస్కృతమునందలి ఊనస్, అనునదియు, ద్రావిడమందలి 'ఒక' శబ్దమును సమాన మాతృకములని తేలఁగా మరల ఘట్టకుటీ ప్రభాతన్యాయ మున కాల్డ్వెల్లుగారి వాదమే సమాశ్రయణీయము. ఇఁక

'ఒఌ' శబ్దము ప్రాచీన రూపము గాదనియు 'ఒర్' శబ్దమే మూలమనియు సిద్ధాంతమును బ్రతిపాదించితిమి గదా.

కావున ఒర్ శబ్దము ద్రావిడమే యనుట సిద్ధము. ఇఁకఁ దెనుఁగుననున్న ఒక, ఒక్కటి, యనుశబ్దమును సంస్కృతమునం దలి ఏకశబ్దభవమునుగా నిరూపించుటకుఁగూడఁ బ్రయత్నములు జరిగినవి. ఇఁక పెర్షియను భాషయందలి 'యక్' శబ్దమున కును బంగాళీభాషలోని 'ఒక్' శబ్దమునకు 'ఒక' శబ్దమునకును ముడిబెట్టనగునా యని ప్రశ్నము. ఏకశబ్దముసాంస్కృతికము. కావున నియ్యది సంస్కృత భవమని యనవచ్చును. అట్లయిన వినుండు. ఫిన్నిషు భాషలయందు 'ఏక' శబ్దసదృశములగు శబ్దములనేకములు గలవు. వ్రోదియాగ్ భాష. ఒగ్, ఒదిగ్ సామో యెద్-ఒకుర్. ఒక్కుర్. ఊకుర్. వ్రోగుల్-అక్. అక్వ్ మాగి యార్ - ఎగ్వ్, లాపిష్ - ఆక్త్. చెరెమిస్—ఇక్ ఇక్ట. మొ॥ 'ఒక' శబ్దమును సంస్కృతభవమనినచో సితియను భాషాభవ మని యేలచెప్పఁగూడదు. వినిగమకమేమి? కావున మరల కాల్డ్వెల్లుగారి సిద్ధాంతమును ఘట్టకుటీప్రభాత న్యాయమును దప్పవుగదా.

ఇఁకనీ 'ఒక' శబ్దమునకుఁగూడ ద్రావిడ జన్యత్వమునే చెప్పవచ్చును. ఒక, ఒక్కయను రెండురూపములలో (ఒక) యనునది నవీనమని యూహింపనగును. తమిళమున 'ఒక్క' యను శబ్దమునకు కూడికయను నర్థముకలదు. "ఒక్క— Together with, in company with, కూడ." అని విన్స్లో గారి తమిళకోశము. తమిళములోని ఒక్కశబ్దమునకుఁగల ధాత్వర్థమునకును ఒక్క శబ్దము నర్థమునకును సరిపోవదేమో యని

కాల్డ్వెల్లుగారు జంకుచున్నారు. కాని తెనుఁగున నీయొక్క శబ్దము సామ్యము, తటాలున, అను నర్థములనుపయోగింపఁ బడుచున్నది. తమిళమున 'ఒ' యను ధాతువునకు to equal, to be like, to match. (తుల్యముగా) అను నర్థమును విన్స్లోగారు వ్రాసియున్నారు. ఒక్కమ్+పడి=ఒక్కంబడి, ఒక్కమ్మడి అను రూపమునందు 'ఒ' ధాతుజన్యమగు ఒక్కమ్ అను రూపము విశేషణముగాఁగూడ వాడఁబడినది. తుల్యమను నర్థమున, 'ఆరెండును నొక్కటియే' అని తెనుఁగున మనము వాడుచున్నాము. కావున 'ఒ' ధాతువునుండి 'ఒక్క' యనురూపమును సాధించి దానినుండి ఒక్కటి, ఒకటియను రూపములు వచ్చినవని చెప్పుట యుక్తియుక్తమని మాయభిప్రాయము.

ఇఁక రెండు శబ్దమునకు ఇర్ మాతృకయని ముందు నిర్ణయము చేసితిమి. ఇరండు, ఎరడు, అనురూపములకును తెనుఁగు నందలి రెండు రూపమునకును వర్ణ వ్యత్యాసముచే సంబంధమునియుఁ జెప్పితిమిగదా. ఉ॥ (త) ఉరల్—రోలు, ఉగుర్—గోరు. దీనికి సంస్కృతమునందు మూలము లేదనుట సిద్ధాంతము. సితియను భాషలలోఁ గొన్ని సామ్యము లున్నట్లు కాల్డ్వెల్లుగారు చెప్పిరిగాని యవి చాలదూరముగా నున్నవి.

ఇఁక నవీనులొకరు రెండు శబ్దంబు ద్వంద్వశబ్ద భవమని యుపపాదించిరి. వారి క్రమమిది— ద్వంద్వ— దొందు— లొందు—రొందు— రండు—ఇరండు— ఎరడు— రెండు. వారి వాదమున కుపబలముగా నీదొందు శబ్దము పిల్లల మాటలయందును విద్యావిహీనుల మాటలయందును దఱచుగా నుపయోగింపఁబడుచున్నదని యుదాహరించియున్నారు.

దొండు, లొండెట్లు గావలయునో దానికిఁ బ్రమాణ మేమియో వారొసంగ లేదు. ఇంతకును దొండు శబ్దము రెండు శబ్దము నుచ్చరింపవలయునని పిల్లలు ప్రయత్నము చేయునప్పుడు గలుగు చున్నదా లేక ద్వంద్వశబ్ద ముచ్చరింపఁబోవునప్పుడు గలుగు చున్నదాయని ప్రశ్నము. రెండు శబ్దమును దల్లి దండ్రులు చెప్పు నప్పుడు దాని నుచ్చరింపఁజాలక దొండు, అనుచున్నారని చెప్పక తప్పదుగదా! అప్పుడు రెండు శబ్దభవమే 'దొండు' అని చెప్పక తప్పదు. అప్పుడీ వాదమేమయినది. ఇఁక దొండు శబ్దమెక్కడనైన సారస్వతముననున్న దేమో కనుఁగొనఁ బ్రయత్నింపవలయును. దొండుశబ్దము ద్వంద్వశబ్ద భవమని యితర ప్రమాణములచే నొప్పుకొనినను దక్కిన ప్రక్రియ సరి పోవదుగదా. ఇంతకును 'ఇరు' శబ్దము మూలరూపమనుట ముందు మేమిచ్చిన యుదాహరణములనుబట్టి నిశ్చితము. ఈ 'ఇరు' అను రూపమనేక ద్రావిడభాషలలోఁ బ్రసిద్ధముగా నున్నది. ఇఁక మా స్నేహితులొకరు ద్వంద్వశబ్దమునుండి రెండు శబ్దమును బుట్టింపనగునేని నేను శకట శబ్దమునుండి బండిశబ్దమును బుట్టింతునని చెప్ప మొదలిడిరి. వారి ప్రక్రియ- శకటి—శక్టి—శట్జి—శండి—హండి—పండి. (ప్రాచీన కన్నడములోని 'ప' కారమును నవీన కన్నడమునందలి 'హ' కారమును నభిన్నములుగదా.) బండి. ఇట్టి వ్యుత్పత్తులా పాతరవ ణీయములనుటలో వింత లేదుగదా.

ఇఁక మూఁడు శబ్దమునకుఁ బ్రాచీన రూపమగునది 'మూ' అని, మున్నూరు, ముగ్గురు, ముప్పది మొ॥ వానినుండి తెలియనగును. దీనికి సంస్కృతప్రాకృత మూలచ్ఛాయయే లేదు.

నాలుగు శబ్దమునకు 'నలు' లేక 'నాల్' అనునవి మూలరూప ములు. ఇవియు ద్రావిడశబ్దములనుటలో విప్రతిపత్తిలేదు. ఇఁక నీ 'నలు' శబ్దముగూడ చతుర్స్వాః అను శబ్దమునకును 'చార్' శబ్దమునకును సంబంధించినదని యెక్కరనిరి. కాని క్రమము వివరింపలేదు. ఈ వ్యుత్పత్తియు 'భవతి' శబ్దమునుండి 'ఆవుద్ది' అనునది వచ్చిన దనుట వంటిదే గదా.

ఐఁదు శబ్దమునకు మూలము 'అయి' లేక 'ఐ'. తెనుఁగునుబట్టి చూడఁగా 'ఏ' శబ్దమే దీనికి మూలమని యూహింపనగును. ఉ॥ ఏను, ఏఁబది. ఇఁక మలయాళము నందలి 'అంజు', 'అంచు' అను శబ్దములును, వాడుక తమిళమునందు మిక్కిలిగాను గ్రాంథిక తమిళమునందరుదుగాను వాడఁబడు 'అంజి' శబ్దము సంస్కృత పంచన్ శబ్దభవము కావచ్చుననియు గుండెర్టుగారూహించిరి. ఈ 'అంజు' అను రూపము మిక్కిలియు నవీనము. ఐదు శబ్దమునుండి ఐందు శబ్దమును, దానినుండి 'అంజి' శబ్దమును కలుగవచ్చును. ప్రాచీన గ్రంథములలో లేని యీ రూపమును మూలరూపమెట్లననగును. ఇంతియ గాక వారనునట్లు పంచ్, హంజ్, గామారి, అంజ్ అని యయినదని చెప్పినయెడల విశేషణ రూపములగు ఏ, ఐన్ అను వానికేమిదిక్కో తెలియక పోవలసి వచ్చును గదా. ఇఁక, 'న్ద' అనునది వాడుకలో 'న్జ' గామారుట తమిళములో నున్నదని కాల్డ్వెల్లుగారు చెప్పుచున్నారు. దీనికి నుదాహరణమును వారీయలేదుగాని మేము గ్రహించి యిచ్చుచున్నాము. ఉ॥ మైందన్ ప్రాచీనరూపము. నవీనము మంజన్. (కొడుకు). (త) ఉయిన్దేన్ (ప్రాచీనరూపము) ఉంజేన్. (నవీ

నము)=జీవించితిని. ఇఁక నీశబ్దమునకును సంస్కృతమున మాతృక లేదనుట సిద్ధాంతము.

ఆఱు శబ్దమునకును ఏడు శబ్దమునకును బూర్వరూపము లగు, అఱు, ఎళు అను శబ్దముల కును సంస్కృతమున మాతృక లేదు. ఆఱు మొదటి రూపమనుటకు, ఉ॥ అఱునది. ఎళు శబ్దమునందలి ళకారము డకారముగాఁ గూడ మారి వర్ణవ్యత్యయముచే తెనుఁగున ఎడుభై అను రూపమునకు బదులుగా 'డెబ్భై' యని యయినది, 'ఆఱు' శబ్దమునకు 'షస్' అనునదియే మాతృకయనియు 'ఏడు' శబ్దమునకు 'సప్త' శబ్దము మాతృకయనియు వీనికి పదహారు, పదిహేడు శబ్దములలోని 'హారు'! 'హేడు' అను శబ్దముల సాహాయ్యమున వ్యుత్పత్తి క్రమము నూహింప వచ్చుననియునొకరు వ్రాసిరి. ఇఁక పద్ధాలుగు, పదహైదు, పదహారు, పదిహేడు, పద్ధెన్మిది. పంధొమ్మిది అను శబ్దములు నవీనములగు వాడుకరూపములుగాని ప్రాచీనరూపములు కావనియును నడుమ'హ' కారము పయివానిలో న్ననిటియందు నొక్క రీతిగానే యుచ్చారణమునందు గలిగిన నొక్కుడుచే వచ్చినదనియుఁ దెలియనగునుగదా. ఇఁక 'హారు' 'హేడు' అనునవి ప్రాచీనములనియుఁ దక్కినవి కావనియు నెంచుట యయుక్తము కదా.

ఎణ్ణు, ఎట్టు, ఎన్మిది యను మూఁడు శబ్దములలో మొదటి రెండును సంస్కృతమునందలి 'అష్టన్' శబ్దమునకు దగ్గఱగానున్నవి. అష్టన్ శబ్దమునుండి ఎట్టు పుట్టినదనవచ్చును గాని మఱల మూలరూపమును బరీక్షించిన యెడల నీవ్యుత్పత్తి సరికాదని తేలుచున్నది. ఎణ్బ, ఎణ్మ, ఎణ్భార మొదలగు శబ్దములనుబట్టి 'ఎణ్' అనునది ప్రాచీనరూపమని తేలుచున్నది.

ఇఁకఁ దెనుఁగునందలి ఎనుబది యను రూపము చక్కఁగాఁగుదు రును. ఎణ్. ఎన్. —ఎను+పది. ఎనుబది. కాని ఎన్మిదియను రూపముమాత్రము గుదుర లేదు. ఇందలి 'ఎణ్' అనునది 'ఇర్' శబ్దవికారమనియు 'మిది' శబ్దము పది శబ్దభవమనియు రెండు తక్కువ పదియని యర్థమనియు నూహింపఁబడినది.

తొమ్మిదియను దానికి ఒన్బదు అనియు ఒంబత్తు అనియు రూపములు కన్పించుచున్నవి. *ఒణ్+పదు=ఒణ్బదు. ఒణ్+పత్తు=ఒంబత్తు ఒకటి తక్కువ పదియనియర్థము. తెనుఁగు నందలి తొమ్మిదియను శబ్దము తొల్+మిది (పది)=తొమ్మిది యని యగుచున్నదనియు 'తొల్' శబ్దమునకు 'మొదలు' అని యర్థమనియు నూహించుచున్నారు. దీనికిబలముగా తొన్నూరు, తొల్లాయిరమ్-(తొమ్మిదివందలు) అను శబ్దములలోఁగూడఁ బయితొల్ శబ్ద మీయర్థముననే యున్నది. దీనిని 'ఊన పంక్తి' శబ్దమునుండి కొందఱు కల్పించుటకుఁ బ్రయత్నించు చున్నారుగాని తొమ్మిదిశబ్దమెట్లు ద్రావిడమో యట్లు 'ఒంబదు' శబ్దమును ద్రావిడమనిచెప్పట యుక్తముగాదా. రెండును నొక్కపద్ధతినే పుట్టినవిగదా. తొమ్మిదిశబ్దమును గల్పించినవారు ఒంబదు శబ్దమును గల్పింపలేరా. ఇదిగాక సుప్రసిద్ధ నవశబ్దముండఁగా యీలక్షణా వృత్త్యాశ్రితమగు 'ఊన శబ్దము' నాశ్రయింపనేల.

పది శబ్దము పంక్తిశబ్ద భవమనియుఁ గొంద ఱూహించిరి. కానిపంక్తి శబ్దభవము 'బంతి' శబ్దము వాడుకలో నుండఁగా

---

* ఒణ్ అనునది ఒందు, ఒణ్ణు మొ॥ విశేష్యరూపములనుండి వచ్చిన దనవచ్చును.

నింకొక తద్భవమును గల్పించుటయేల. ఇదిగాక 'దశ' అను సంస్కృత శబ్దము ప్రసిద్ధమయియుండఁగా పంక్తిశబ్దము నుండియేల ద్రావిడులు తమ తద్భవమును బొందిరన నగునో యూహింప నలవిగాదు. ఈ పంక్తిశబ్దమునకుఁ దద్భవము 'పది' యను నర్థముననే మఱియేభాషనైనను సుప్రసిద్ధముగా వాడఁబడుచున్నదా! కావున పది శబ్దమును సంస్కృత జన్యముకాదు.

నూఱు, వంద యను శబ్దములు రెండును ద్రావిడములేగాని సాంస్కృతికములుగావు. ఇందు వందశబ్దము శత శబ్దభవమని నవీనులొక్కరు సూచింప సాహసించిరి గానివ్యుత్పత్తి క్రమము నీయలేదు. ఇది యెట్లు శత శబ్ద భవమో దురూహము.

తమిళమునందలి ఆయిరము, కన్నడమునందలి సావిర, అను శబ్దములు సహస్ర శబ్దభవములు కావచ్చును. తెనుఁగునందలి వేయి శబ్దము ప్రాకృతమునందలి ' ఆవియ ' శబ్దభవమని నవీనులొక రూహించుచున్నారు. ఇట్లు చెప్పుటకు శబ్దక్రమమునఁ బ్రతిబంధకము లేకపోవు నేమోగాని యిది యెంత మట్టునకు యుక్తమో పరీక్షింపవలయును.

ఈ పయి నీయఁబడిన శబ్దోత్పత్తి క్రమము ననుసరించి ద్రావిడ సంఖ్యావాచకములు సంస్కృత జన్యములు గావనుట యుక్తి దూరముకాదు గదా. సంస్కృత భవములగు చార్ మొ॥ రూపములును ద్రావిడ రూపములగు ' నాల్ ' మొ॥ నవియుఁ గొన్ని ద్రావిడ భాషలయందుఁ బర్యాయములుగా నుపయోగింపఁబడుటను బరీక్షింపఁగా నీరెండు రూపములకును నభిన్నత యెన్నడును లేదని తేలుచున్నది గాదా. ఇఁక సంస్కృతరూపములు రెండువిధములుగా నొక్క కాలముననే

ద్రావిడులయందే మారినవని చెప్పుట యుక్తి సహముకాదు గదా.

V. క్రియలు:—ముందు పరీక్షింపఁబడిన భాషాభాగము లెట్లభిప్రాయప్రకటనమునకు ముఖ్యములగు సాధనములో యట్లే క్రియలుగూడఁ బ్రధానములయినవి. ప్రతివాక్యమునందును గ్రియ యుపాత్తముగానో యధ్యాహార్యముగానో కనుపట్టుచునే యుండును గావున భాషాప్రాథమిక స్థితియందును గూడనయ్యది యుండునని యూహింపనగును. ద్రావిడభాషలయందలి క్రియారూపముల సామాన్యలక్షణములను రూపనిష్పత్తిని, స్వరూపము మొదలగు వానిని గ్రిందవివరించి, వానికి సంస్కృత క్రియలతోఁగల సామ్యవైషమ్యములను జర్చింతుము.

a) సంస్కృతభాషయందలి ధాతువులుపసర్గలు చేరుట వలనఁ దమయర్థమును మిక్కిలియుఁ జిత్రముగా మార్చుకొనుచుండు ననుట యీక్రింది శ్లోకమునుండియు నందలి యుదాహరణములనుండియు నువ్యక్తము. శ్లో॥ ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యత్ర నీయతే। ప్రహారాహారసంహార విహారపరిహారవత్ ॥

పయి యుదాహరణములయందు 'హృ' ధాతువు. దాని పయిని వివిధములగు నుపసర్గములు చేర్చుకొనఁగా వివిధములగు రూపములు భిన్నార్థములతోఁ గలుగుచున్నవి. (ప్ర) హారము-దెబ్బ (ఆ) హారము-తిండి (సం) హారము-చంపుట(వి) హారము—విహరించుట (పరి) హారము—తొలగించుట. ఇట్టి యద్భుతమయిన క్రమము ద్రావిడ భాషలయందున్నదని చెప్పఁగలమా. ద్రావిడ భాషలయందలి క్రియాస్వరూపము సం

స్కృతమునందలి క్రియాస్వరూపము కంటె నెంతయును వైశా ల్యము తక్కువగాఁ గలది. మేలుకొను మీదుకొను మొదలగు క్రియారూపములయందలి కొనుధాతువునకుఁ బూర్వముననున్న శబ్దము లుపసర్గములుకావు. అవి నామములనియే చెప్పనగును. ఇంతటి వైశాల్య విహీనములగు రూపములుగల క్రియలతోఁ గూడిన ద్రావిడ భాషలను దేవ భాషాజనితములని చెప్పన గునా.

b) ద్రావిడ భాషలయందలి యకర్మక క్రియలు ధాతు వుల తుదినున్న యక్కరములలోఁ గొన్ని మార్పులు గలు గుట వలన సకర్మకములగుచున్నవి.

(1) తుదిని రూప నిష్పత్తికొఱకు వచ్చిన ప్రత్యయము నకుఁ బరుషతయు ద్విరుక్తియుఁ గల్పించుటచే నకర్మకములు సకర్మకములగుచున్నవి. ఉ॥ పెరు+(గు) = పెరుగు = (వృద్ధి పొందు) ఈతుదినున్న గు ప్రత్యయము 'కు' గా మారుటవలన పెరుక్కు, అను రూపము కలుగుచున్నది. దీని కర్థము 'అభి వృద్ధిచేయు' (త) కొన్ని స్థలములయందు 'జ్గ్' అను రూపము కూడ నిట్లే మారుచుండును. ఇట్లు రూపనిష్పత్తికివచ్చిన వర్ణక ములగు కు, దు, మొదలగువానికి నానునాసిక్యము స్వాభా వికమని ముందు వివరించితిమి. (త) అడంగు = అడఁగిపోవు. అడక్కు = అడఁచు. (త) పోఁగు = పోవు. పోక్కు=పోఁగొట్టు.

(2) 'సు' వర్ణకము 'చ్చు' వర్ణకముగా మారుటవలన నకర్మక క్రియలు సకర్మకములగును. అడైసు— కూర్పఁబడు. అడైచ్చు—కూర్చు.

(3) దు వర్ణకముగాని యనునాసికపూర్వకమగు దు వర్ణకముగాని, పరుషత్వమును ద్విత్వమును బొందుట వలన సకర్మకమగుచున్నది. (త) తిరుందు=సరియగు, తిరుత్తు= సరిచేయు.

(4) బువర్ణకముగాని సానునాసిక బు వర్ణకముగాని 'ప్పు' వర్ణకమగుటనలన సకర్మకత్వంబు వచ్చుచున్నది. (త) నిరుంబు = నిండు, నిరుప్పు = నించు.

పయి యుదాహరణము లన్నియు తమిళమునుండియే కాల్డ్వెల్లుగారిచే గ్రహింపఁబడినవి. తెనుఁగునఁగూడఁ బయి వానివలె మార్పులు జరుగుచుండును. ఉ॥ తూఁగు, తూఁచు ; మేయు, మేపు; రేగు, రేచు, నిండు, నించు. మొ॥ పయివిధ మున ధాతువులు సకర్మకములగుటకు సరియగు మార్పేదయిన సంస్కృతమునందుఁ గలదా !

(c) ఇఁక ద్రావిడభాషలయందలి ప్రేరణార్థకములకును సంస్కృతమునందలి ప్రేరణార్థకములకును (ణిజంతములకు) సామ్య మేమయినను గలదేమో పరీక్షింతము. ద్రావిడభాషలయందలి ణిజంతములలో ధాతువు తుదినొక యాగమము వచ్చుటచే నారూపములగుచున్నవి. తెనుఁగున నియ్యది 'ఇంచు' తమిళ మున, వి, లేక బి, లేక ప్పి. హళె గన్నడమున 'ఇచు' హొస గన్నడమున 'ఇసు' ఉ॥ (త) సెయ్ = చేయు. సెయ్ + వి + క్కి_ఱేఁ = చేయించుచున్నాను. కాణ్ = చూచు, కాణ్ + బి+క్కి_ఱేఁ=చూపుచున్నాను. తిరు = తిరుగు, తిరు + ప్పి +

కిజేన్= త్రిప్పుచున్నాను. (క) మాడు = చేయు, మాడిసు= చేయించు, నగు=నవ్వు, నగిసు=నవ్వించు.

తెనుఁగునందలి 'ఇంచు' లేక 'పించు' కన్నడమునందలి 'ఇచు' లేక 'ఇసు' తమిళమునందలి బి, వి, ప్పి అనునవి యన్ని యును నేకమాతృకములని పరిశీలనమువలనఁ దేలుచున్నది. తెనుఁగునందలి ఇంచు, అనుదానికి మొదటిరూపము ఇచు. మధ్యనాను నాసిక్యము ద్రావిడభాషా స్వభావముచే వచ్చు చుండుననుట పూర్వోదాహృతములగు ననేకోదాహరణము లచే గతార్థము. దీనికింతకంటెను విశదమగు నుదాహరణము సంస్కృత క్రియలయందుఁ గన్పట్టును. సృజి+చు=సృజి+౯+ చు=సృజించు. తెనుఁగు వ్యాకరణములందుఁ బయి ధాతువు లకుఁ గూడ నించుగాగమమే విధియింపఁబడినది. కాని గు, చు, పు మొదలగునవి ధాతువులవెనుకఁ జేర్పంబడుచుండు నని కొన్ని యుదాహరణములు ముందీయంబడినవి. కావున దీనిని గూడ నిట్లే గ్రహియించుట యుక్తమును లాఘవము నని చెప్పనగును. సంస్కృతధాతువులు ద్రావిడభాషలయంది కారాంతములుగా గ్రహియించుట సాధారణమగు సమాన ధర్మము. ఉ॥ త॥ పరీక్షి+క్కి_ఱేౕ, తె॥ సృజి + న్చు సృజించు. క॥ రక్షి+సు, రక్షిసు. పయివాదము ప్రకారము ప్రేరణార్థకములయందు 'ఇ' వర్ణకమే ముఖ్యావయవ మగు నని తేలుచున్నది. కన్నడమునందీ యానునాసిక్యము లేక పోవు టచే ఇ+చు, ఇచు అనిగాని ఇ+సు=ఇసు అని గాని చేరుటచే రూపసిద్ధి యగుచున్నది. అందునుగూడఁ బ్రేరణార్థకముల యందు వచ్చు ప్రత్యయముయొక్క ముఖ్యావయవము 'ఇ'

వర్ణమే గదా. తమిళమునందలి బి, వి, ప్పి వర్ణకములయం దును 'ఇ' కారమే ప్రధానమననగును. ప్రాచీనపుట అవము నందు 'క్క' వర్ణకమునకు బదులుగా 'ప్ప' యనునది కన్పించు చున్నది. నడక్క=నడప్ప. కావున 'కు' వర్ణమునకు బదులుగా నొకభాషయందు 'చు' వర్ణకమును మఱియొక దానియందు 'ప' వర్ణకమును వచ్చెనని దీనినిబట్టి తెలియనగును. అప్పుడు తమిళమునందును 'ఇ' వర్ణకమే ప్రేరణార్థకమనుట సిద్ధాంతము. ఇంక సంస్కృతమునందును 'ఇ' కారమే ప్రేరణార్థక ముగాఁ జేర్పఁబడుచున్నదనుట సర్వవిదితము. దీనికి సంస్కృత వ్యాకరణమున 'ణిచ్' అని చెప్పుదురు గదా. ఇందలి 'ఇ' వర్ణముచేరుటచేతనే (అయ్) కరోతి = చేయుచున్నాఁడు. కారయతి=చేయించుచున్నాఁడు అని యర్థము వచ్చినది.

ద్రావిడభాషలకు సంస్కృత జన్యత్వము నెట్లయినను నంటఁగట్టు నభిప్రాయము గలవారికి బలమగు నాధారమొకటి లభించినదని సంతసింపనగును. తాత్కాలికముగానయిన సంత సింపనిండు. దీని పూర్వరూపమును మనము గొంచెము పరీ క్షించి చూచిన దీని సంస్కృత జన్యత్వము సూర్యోదయము నందలి పొగమంచువలె విచ్చి పోవును గదా. ఇందలి 'ఇ' వర్ణకము, 'ఈ' ధాత్వభిన్నము. 'ఈ' ధాతువు ద్రావిడభాషా సాధారణమ గుటచే మూల ద్రావిడభాషా గతమననగును. ఉ॥(త)ఈగిఱేన్. ఇక్కిఱేన్ = ఇచ్చుచున్నాను. (క) ఈవెను. ఇత్తు = ఇచ్చి. పయి, 'ఇ' ధాతువే ప్రేరణార్థకముగా నిందుఁ జేరినదన వచ్చును. దీనికి బలముగా చేయనిచ్చుచున్నాను, అనుదానికిని చేయించుచున్నాను అనుదానికిని గలుగు నర్థభేదము స్వల్పమే

గదా! కావునఁ బయి 'ఇ' పర్ణకమును ద్రావిడమనియే నిర్ణయించుటలో నేమి ప్రతిబంధకముగలదు. ద్రావిడభాషలు సంస్కృతమునుండి యనేకములగు పదములను, విజ్ఞానమును సంపాదించుకొనిన యనుటలో నెవ్వరు భిన్నాభిప్రాయము గలవారు కారుగాన, నాలుగువస్తువు లొక్కరినుండి యెరువు దెచ్చికొన్నవాని యింటిలో స్వాభావికముగా నుండఁదగినదియు వాఁడు సంపాదించు కొన్నదియునగు వస్తువునుగాంచి యయ్యదియు నితరుల నుండియే గ్రహింపఁబడెననుట ప్రపంచమునందలి ధనవసువాహనాదులయందుఁ బరిపాటియయినఁ గావచ్చునుగాని కేవలపదములను మాత్రమే గ్రహియించు భాషావిషయమునఁగూడ నట్టి యన్యాయమున కేల విజ్ఞులొడి గట్టుకొనవలయును.

(d) పయి విధిని బరీక్షింపఁబడిన ప్రేరణార్థకంబు ద్రావిడ భాషలకు సంస్కృత జన్యత్వంబును నిరూపింపఁజాలమి నింకఁ గర్మార్థక ప్రక్రియనాశ్రయింతిము. సంస్కృతమునందును నితరములగు నిండో యూరపియను భాషలయందును గర్మార్థక ప్రక్రియ ప్రసిద్ధముగదా. ఉ॥ కరోతి, కర్మార్థకము. క్రియతే. మొ॥. ద్రావిడభాషలయందుఁ బయి రూపమునఁ గర్మార్థకములను జెప్పు నభ్యాసములేదు. 'పడు' అను ధాతువు మఱియొక ధాతువునకుఁ జేర్పఁబడఁగాఁ గర్మార్థక రూపము లేర్పడుచున్నవి. ఉ॥ సెయ్యప్పడుమ్. (త) = చేయఁబడును, (క) మాడల్పడుత్తదె. ఈపయి ధాతువులకు చేయుట ననుభవించును అని గదా యవయవార్థము. ఇదిగాక చేసినపని; మాడిద కెలస (క) సెయ్దవేలై (త) మొదలగు స్థలములయందు (పడు)

ధాత్వనుప్రయోగము లేకయే సామాన్యముగు కర్త్రర్థక క్రియాజన్య విశేషణ ప్రయోగముచేతనే (Active participle) కర్మార్థకము కలుగుచున్నది. ఇట్టి క్రియాజన్య విశేషణములమహాత్ముల విషయమునఁ బ్రయోగించినప్పుడా యమహాత్ములయందు సామాన్యముగాఁ గర్తృత్వము సంబద్ధము కాదు గనుక నన్వయలోపము రాదు. పయి 'చేసినపని' యను నుదాహరణమునఁ బనికిఁ గర్తృత్వమసంభవము. ఇట్టి సందర్భములలో వాడంబడు 'కృతంకర్మ'యను సంస్కృత ప్రయోగము పయి ద్రావిడ భాషలలోని వాడుకతో సంపూర్ణముగా భేదించుచున్నది గదా. చేసిన యను క్రియాజన్య విశేషణము కర్త్రర్థకముగాను గర్మార్థకముగాను నుపయోగింపఁబడునట్లు సంస్కృతమందలి 'కృతమ్' అను విశేషణము ప్రయోగింప వీలగునా! ఇఁక ద్రావిడ భాషలయందుఁ గర్మమహద్వాచకముగా నున్నప్పుడు "పిల్చిన మనుష్యుఁడు' అని ప్రయోగించినయెడల వినిగమకము లేకపోవుటచే, మనుష్యుఁడు పిలువంబడెనా, లేక పిల్చెనా, యను సందిగ్ధత కలుగవలసి వచ్చుచున్నది. ఆసమయమున "నీవు పిల్చిన మనుష్యుఁడు,' అని కర్తను యీ క్రియాజన్య విశేషణమునకు ముందు ప్రయోగించినయెడల నా సంశయము పోవుచున్నది. 'పండ్లు అమ్ముచున్నవి' అను వాడుకవంటివి సంస్కృతమున లేకున్నను నిండో యూరపియను భాషా కుటుంబమునకుఁ జేరిన యింగ్లీషున 'Fruit sells at 4 as a dozen' మొదలగు ప్రయోగములలో నున్నవని నిరూపించిన నిరూపింపనగునుగాని 'నేను పిల్చిన మనుష్యుఁడు' అను ప్రయోగములవంటివి లేవనిచెప్పనగును గదా. ఈప్రయోగములే ద్రావిడ

భాషాస్వభావమును సంస్కృత స్వభావముకంటెను నిండో యూరపియను భాషాస్వభావముకంటెను భిన్నమని చూపించుచున్నవి. ద్రావిడభాషలకు సంస్కృత జన్యత్వమును నిరూపించుటలో నియ్యదియు బాధకమనుట సిద్ధాంతము.

(c) వ్యతిరేకార్థకములగు ప్రయోగములు ద్రావిడ భాషలయొక్క ప్రత్యేకతను, సంస్కృత భిన్నతను దప్పక నిరూపించుచున్నవని క్రింది యుదాహరణములవలనఁ దెలియనగును. సంస్కృతమున 'న' యనునది నఞర్థకము. దీనినే క్రియతో నన్వయించి 'నగచ్ఛతి' 'వెళ్లలేదు.' అను నర్థమును దెల్పనగును. ఆంగ్లమునను 'not' అని గాని 'no' అనిగాని ప్రయోగించుటవలన నీ యర్థము లభించును. ద్రావిడ భాషల యందుఁ బయిరీతినిగాక ధాతువునకు వ్యతిరేకార్థకమగు నాగమమును జేర్చుటచే వ్యతిరేకార్థక రూపములభించుచున్నది. ఉ॥ చేయు + కజి (బా॥ వ్యా). చేయక. చేయడు. చేయఁబడడు, మొదలగు ప్రయోగములను బరీక్షించిన 'అ' కారము మాత్రమే నిజమగు వ్యతిరేకార్థక ప్రత్యయమనక తప్పదు. కన్నడమునందును, తిళియను తిళి + అ + ను, అఱవమునందలి, సెయ్యాదు, పోగాదు, మొదలగు వ్యతిరేకార్థకములను బట్టిచూడఁగా 'ఆ' యనునది వ్యతిరేకార్థకముగాఁ గ్రియలనడుమఁ జేరుచున్నదని తెలియనగును. ఈ క్రియలకు కాలత్రయమునకు వేఱువేఱు రూపములు లేవు. ఒక్కరూపమే మూఁడు కాలములను బోధించును.

ఈరీతిని వ్యతిరేకార్థకములఁ గూర్చుట ద్రావిడభాషా సంప్రదాయమనక తప్పదు. పయిప్రకారమగు వాడుకయొక్క

ఛాయయయినను సంస్కృతమునందుఁ గలదా. లేనప్పుడు సంస్కృతమునకు ద్రావిడభాషాజనకత్వమెట్లు నిరూపింపనగును.

లేదు, ఇల్ల, ఇల్లై, యను పదములను జేర్చుటచేతను ద్రావిడభాషలయందు వ్యతిరేకార్థకములు సిద్ధించుచున్నవి. ఈ పదములన్నియును ఇల్ అనునట్టి నఞర్థక జన్యములని తేలుచున్నది. తెనుఁగునందలి 'లే' అనునది వర్ణవ్యత్యయముచేఁ గలిగినదని చెప్పనగును. ఇల్ల = లే. తమిళకర్ణాటక భాషలయందు 'అల్' అనునొక వ్యతిరేకార్థకము, అల్ల, అల్లదు మొదలగువానిలోఁ గన్పట్టుచున్నది. అల్, ఇల్, అనునవి రెండును నఞర్థకములుగా ద్రావిడభాషలలో వాడఁబడుచున్నవి. అందలి అల్, పదమును, ధాత్వనుప్రయుక్తమగు 'అ' యను వ్యతిరేకార్థకమును నభిన్నములని కాల్డ్వెల్లుగారి యభిప్రాయము.

b) సంస్కృతము నందున్నన్ని క్రియారూపములును గాలభేదములును విశాలమగు నామధాతుప్రక్రియయు, సన్నంత ప్రక్రియయు, యఙంతప్రక్రియయు, యఙ్లుగంత ప్రక్రియయు ద్రావిడభాషలయందు లేవనుట ద్రావిడభాషలయొక్క ప్రాథమికత్వమును, బయి నీయంబడిన యనేకభేదములతోఁ గలిపి, సమన్వయించునప్పుడు సంస్కృత భాషాజన్యత్వమును, నిరూపించుచున్నదనుటలో సంశయము లేదు.

g) తెనుఁగునందలి 'నేను పండితుఁడను', 'నీవు కవివి', అను ప్రయోగములకును, తమిళ మలయాళములందలి 'అడియేన్' = నేను దాసుఁడను, అనువాడుకకును, కన్నడమునందలి నాన్ పండితనెన్ అను ప్రయోగమునకును సమానమగు సం

స్కృతపు వాడుకను బరీక్షించినఁ బయిభాషలకుఁగల భేదము తప్పకఁ గోచరింపఁగలదు. అహంపండితః అనునప్పుడు పండితః అను శబ్దమునకుఁ బయి యుత్తమపురుషైక వచనముతో సామా నాధికరణ్యమును బోధించుటకు, సార్వనామిక ప్రత్యయయోగ మనావశ్యకము గదా!

h) సంస్కృతమునందలి సముచ్చయ వాచకమగు 'చ' కారమునకును, ద్రావిడభాషలయందలి సముచ్చయార్థక మగు 'ఉ' శబ్దమునకును సామ్యము లేమి యాభాషలకు జన్య జనక భావము లేదని తెలుపుట లేదా.

i) సంస్కృతమునందలి క్రియారూపములకు లింగ బోధక ప్రత్యయములుండవు. అనగా 'కరోతి' అను నొక్క క్రియారూపమే మూఁడులింగముల యందును మార్పులేక యే వాడఁబడుచుండును. ఉ॥ సః కరోతి=వాఁడు చేయుచున్నాఁడు. సాకరోతి = ఆమె చేయుచున్నది. తత్ కరోతి = అదిచేయు చున్నది. ద్రావిడభాషలయందట్లు గాక క్రియారూపముల తుదిని, డు, అళ్,ది, మొదలగు ప్రత్యయములు కర్తృనిష్ఠ పురు షత్వస్త్రీత్వ నపుంసకత్వములను వరుసగా బోధించుచున్నవి. ఇట్టి వైలక్షణ్యము ద్రావిడభాషలకు సంస్కృత జన్యత్వమును బోధించుటలో బాధకము గాకుండునా!

పయి విధములగు ననేకభేదములు తత్తద్భాషా స్వభావ గతములయి ద్రావిడభాషలయొక్క ప్రాచీనతను, సంస్కృత భాషాఽజన్యత్వమును నిరూపించుచుననుటలోఁ బారమార్థిక చింతగల పండితప్రకాండులు విప్రతిపన్నులు కానేరరని చెప్పక తప్పదు.

---

# VII. కాల్డ్వెల్లుగారి సిద్ధాంతము.

ద్రావిడభాషా శాస్త్రమున నీడులేని పరిశ్రమముఁ జేసి యీభాషలకుఁ గల సంబంధములను జూపుచు గొప్ప వ్యాకరణమును వ్రాసిన కాల్డ్వెల్లుగారి ముఖ్య సిద్ధాంతమును ననఁగా వారు ద్రావిడభాషల నేభాషలతో సంబంధము గలవానిగా నిర్ణయించిరను విషయమును సంక్షేపముగాఁ గ్రింద వివరింతుము.

ద్రావిడభాషలకు సితియను భాషలతోడను, ఇండోయూరపియను భాషలతోడను సామ్యములు గలవనియు, నీ సంబంధములీ మూఁడుజాతులవారును నెక్కడనో ప్రప్రథమమునఁ గలిసియుండవలెనని నిరూపించుచున్నవనియు వీరి వాదము. సంస్కృతమును మాటాడు నార్యులెట్లు ఇరేనియనులతోఁ గలిసి యొక్క జాతివారుగా మొదటనుండియును గాలక్రమమునఁ దమ సోదరులను విడిచి హిందూదేశము నుత్తర మార్గమునఁ బ్రవేశించి యక్కడనుండిన యనాగరకులను జయించి స్థిరపడిరో యట్లే యీద్రావిడులు నొక కాలమునఁ బయి మార్గముననే హిందూదేశమును బ్రవేశించి యక్కడ స్థిరపడిరని కాల్డ్వెల్లుగారి యాశయము. ఈ కల్పనమున కాధారములు సితియను భాషా కుటుంబములకును ద్రావిడ భాషా కుటుంబములకునుగల సామ్యములును, బెలూచిస్థానమునందొక ద్రావిడభాషయని చెప్పఁదగు బ్రాహూయీ భాష

మాటాడఁ బడుచుండుటయు నయియున్నవి. సిథియను శబ్ద
మును కాల్డ్వెల్లుగారు ఐరోపా, ఆసియా యను ఖండముల
నడిమిభాగమునను నుత్తరపు కొనలను నివసించు ద్రిమ్మరులును
ననాగరకులును నగు జనులను గ్రహించునట్లు సామాన్యముగా
వాడియున్నారు. ఇందు ఫిన్నిషు, తుర్కిషు, మంగోలియను,
తుంగుసియను భాషల కుటుంబములన్నియు గ్రహింపఁబడినవి.
మొదటి ప్రకరణమున వివరింపఁబడిన ఫిన్నో ఉగ్రియను భాషా
కుటుంబములకుఁ బయి సిథియను భాషా కుటుంబములకును
సరిపోవును గావున నందు ద్రావిడభాషలు కాల్డ్వెల్లుగారిచేఁ
జేర్పఁబడినవని యాప్రకరణమున వ్రాయంబడినది. ఇఁకఁ బయి
కల్పనప్రకార మార్యులు హిందూదేశమునఁ బ్రవేశించు
నప్పటికే ద్రావిడులందుండిరనియు వారితోడనో మఱి యెవరి
తోడనో వీరి కనేక యుద్ధములు జరిగినవనియును నందు వీరు
క్రమక్రమముగా దక్షిణ దేశమునకుఁ దరిమివేయఁబడి యుండు
రనియు నూహింపఁదగును. పయి యుద్ధములయందోడిన యనం
తరమో యంతకుమున్నో దక్షిణదేశమునందలి నదీతీరములను
ఫలవంతములగు ప్రదేశములను ద్రావిడు లాక్రమించుకొనిరి.
అట్లు యుద్ధములయం దోడినవారిలోఁ గొందఱు మాత్రము
హిందూదేశముయొక్క మధ్యభాగములందలి కొండలలో నివ
సింపం జొచ్చిరనియును వారి సంతతివారే యిప్పుడు ద్రావిడ
భాషలను మాటాడుచు నాయాప్రాంతములం దున్నారనియు
నూహింపఁదగును.

ఇఁక కాల్డ్వెల్లుగారి మతమున ద్రావిడభాషలతో
సిథియను భాషల కనేక సామ్యము లుండుటచే వానికి సంబంధ

మున్నదను నూహను బెహిస్టును ఫలకముల యందలి భాషతో ద్రావిడ భాషలకుఁగల సామ్యము మఱింత బలపఱచుచున్నది. ఈ బెహిస్టును పెర్షియా దేశమునందలి యొక గ్రామము. ఇది యా దేశమునందలి జాంగర్సు పర్వత పంక్తులలో కెర్కానది యొక్క యుపనదియగు 'సమస్ - అబ్' అను దాని కుడి యొడ్డుననున్నది. ఈ ప్రదేశమున నొక గొప్ప పర్వత ప్రాంత భాగమున దీర్ఘములగు శాసనములు గలవు. ఈ శాసనములు 518 (క్రీ॥పూ॥) సం॥లోని వాఁడగు డెరయస అను రాజుయొక్క చరిత్రమును జయములను వంశవృక్షమును దెల్పుచున్నవి. ఇవి పెర్షియను, బాబిలోనియను, మీడియను అనఁబడెడు కోణాకారపు లిపులలో వ్రాయఁబడినవి. ఇందలి భాషాభేదములకు ద్రావిడభాషలకును గల సామ్యములు సితి యను భాషల ప్రాచీన రూపములకును ద్రావిడ భాషలకును గల సంబంధమును దెల్పుచున్నవి. కాల్డ్వెల్లుగారిచేఁ జెప్పఁ బడిన వీని సామ్యములు.

(1) ఇందు మూర్ధన్యములగు ట, డ, ణ లుగలవు.

(2) పదాదిని బరుషములను బద మధ్యమున సరళ ములను నుపయోగించుటయందును,సరళములు జడ్డలుగాకుండఁ గను, బరుషములు మాత్రము జడ్డలుగాను ప్రయోగించుటలో నిందలి భాషలకును దమిళమునకును సామ్యముగలదు.

(3) ఇందలి షష్ఠీవిభక్తి ప్రత్యయములు 'న, నిన, ఇన్న' అనునవి. ఇయ్యవి తెలుఁగునందలి, 'ని', అను దానితోడను బ్రాహుయీ గోండ్ భాషలందుఁగల 'న' లేక 'అ' అను

వానితోడను తమిళమునందలి 'ఇఞ' అను దానితోడను సరి పోవుచున్నవి.

(4) ఈ ఫలకములందలి చతుర్థీ విభక్తి ప్రత్యయములు 'ఇక్కు' 'ఇక్కు' అనునవి. వీనికి ఉగ్రియను కుటుంబములందును ద్రావిడ భాషలందును సామ్యములుగలవు. ఫలకములందలి నినిక్కు (నీకొఱకు) అను దానికిని (క) నినగె, (మ) నినక్కు. అనువానికిని మిక్కిలి సామ్యముగలదు.

(5) ఫలక భాషయందలి ద్వితీయావిభక్తి ప్రత్యయములు, 'ఉఞ, ఇఞ, ఞ' అనునవి. తెలుఁగునందలి, 'ను', 'ని' అను దానిని కన్నడమునందలి 'అ ', 'అన్ను' అను వానిని బయి వానితో సరిపోల్పనగును.

(6) పయి ఫలకములయందు వ్రాయఁబడిన సంఖ్యా వాచకము 'కిర్' అనునది మాత్రమే. దీని విశేషణరూపములు 'ర', 'ఇట్టి' అనునవి. కుభాషయందలి విశేషణరూపము 'ర' అనునది ఫలకములందలి పయి రూపమును మిక్కిలి పోలి యున్నది. ఈ ఫలకములందలి సంఖ్యావాచక విశేషణరూపములు 'ఇమ్' అను దానితో నంతమందును. తమిళమునందు 'ఆమ్' అనునదియు సామోయెద్ భాషలో 'ఇమ్' అనునదియు పయి విశేషణరూపముల యంతములు.

(7) ద్రావిడ భాషలయందువలెనే యీ ఫలకములయం దును మధ్యమ పురుషైక వచనము 'నీ' అనునది. ద్వితీయా విభక్త్యంగము 'నిఞ'.

(8) సంబంధబోధక సర్వనామములకు బదులుగా నిందును గ్రియాజన్య విశేషణములు ప్రయోగింపఁబడినవి. ఇది ద్రావిడ భాషలను మిక్కిలి పోలియున్నది.

(9) వ్యతిరేక ప్రార్థనాద్యర్థకము తుదిని ఫలకములందు 'ఇన్ని' అనియు గోండ్ భాషలో 'మిన్ని' యనియునున్నవి.

ఈ శాసనముల యందలి భాషలు సితియను భాషా కుటుంబముతోడను నందును ముఖ్యముగా ఉగ్రోఫిన్నిష్ భాషలతోడను సంబంధించి యున్నవనుటవలన మొట్టమొదట సితియనులును ద్రావిడులును నార్యులఁను గలసి ఆసియా నడుమనున్న ప్రదేశములలో జీవించిరనియును ద్రావిడులార్యులను సితియనులను విడిచి హిందూస్థానము వైపునకు వచ్చుచు నడుమ బెలూచి స్థానమునఁ గొందఱను విడిచి హిందూస్థానమును బ్రవేశించిరని యూహింపనగును. సితియను భాషలకును నిండోయూరపియను భాషలకును గల భేదముల కాయా జాతివారి మేధా విశేషములకుఁ గల తారతమ్యములును, జీవన పద్ధతులయందుఁగల భేదములును గారణము లయినవని యూహింపనగును.

## ద్రావిడ భాషాగతములగు నిండోయూరపియను భాషాసామ్యములు.

(1) రెండచ్చులకు సన్నికర్ష కలిగినప్పు డుచ్చారణములో వానికి భేదముఁ దెలుపుటకు నడుమ 'న' కారము వచ్చుట గ్రీకు భాషయందును ద్రావిడ భాషలందును సమానము. ఈ కార్యమునకు ద్రావిడ భాషలయందు సాధారణముగా, య్, వ్, న్,

అనువానిలో నేదో యొక్కటి యుపయోగింపఁబడును. ఉ॥ అది+ఇట్లు=అది+య్+ఇట్లు. (త) నర+ఇల్లై=నర+వ్+ఇల్లై (రాలేదు) (త) వ్యళి+అల్ల = వళి+య్+అల్ల. (త్రోవకాదు). వానికి+న్+ఇచ్చితిని = వానికినిచ్చితిని. (త) కాట్టి+ఏన్=కాట్టి నేన్. ఇరుంద+అన్ = ఇరుందన్. ఇరుక్కిన్ద్రి+అ = ఇరుక్కి న్ద్రిన. మొ॥

(2) ద్రావిడభాషా ప్రథమపురుష సర్వనామముల యందు లింగభేదముండుటయు ముఖ్యముగా నపుంసకలింగ ముండుటయుఁ గూడ నిండోయూరపియను భాషలతోడి సామ్య మును జూపుచున్నది.

(3) ప్రథమ పురుషమునందలి నపుంసక లింగ సర్వ నామాంగము, త, ద, వర్ణముల నొప్పుచుండుట. ఉ॥ అద. దానిని. మొ॥

(4) లాటిను భాషలోవలె నిందును 'అ' కారము నపుంసక బహువచన ప్రత్యయముగా నుండుట. 'గళ్' అనునది ద్రావిడభాషల యందు నపుంసక బహువచన ప్రత్యయమయి నను దానికంటెముందు 'అ' యనునది పయి ప్రత్యయముగా నుండెడిదని కాల్డ్వెల్లుగారి యూహ. తమిళములోని పిర, సిల= కొన్ని, పల=అనేకము, అరియ=కష్టసాధ్యములు, అను పదము లయందును, ఇరుక్కిన్ద్రి+న్+అ=ఇరుక్కిన్ద్రిన (ఉన్నవి.) అను క్రియారూపములయందును మలయాళములోని 'అవ'=(అవి), 'ఇవ' (ఇవి) అను సర్వనామముల యందును, కన్నడమునందలి అవర (వారియొక్క) అనురూపమునందలి యంగమగు 'అవ' అనుదాని తుదిని, తెనుఁగునందలి వా, వీ, శబ్దములు అవ,

ఇవ, అను రూపములనుండి వచ్చినవిగనుక వానియందును బయి 'అ' కారమున్నదని వారి సిద్ధాంతము.

(5) దూరబోధకమగు 'అ' శబ్దమును, సామీప్య బోధకమగు 'ఇ' శబ్దమును నిందును నుండుట.

(6) పర్షియనుభాషలోవలె భూతకాలమును బోధించు క్రియారూపములు 'ద' కారమును జేర్చుటచే ద్రావిడభాషల యందును సిద్ధించుట. క॥ నుడి+ద్+ఉ=నుడిదు (చెప్పి) ఇళి+ద్+ఎను=ఇళిదెను (దిగితిని). త॥ సెయ్+ద్+ఉ=సెద్దు (చేసి) ఇరు+ఞ+ద్+ఏఞ = ఇరుందేఞ (ఉంటిని) సెయ్ + ద్+ఏఞ= సెద్దేఞ. మలయాళమునందు 'నడందు'=నడచి అనురూపమే 'నడన్ను' అనురూపముగా మారినది. చెయ్ + ద్ + ఏఞ = చెద్దేఞ (చేసితిని). తెనుఁగున చేసితిని మొదలగు రూపముల యందు 'ద' స్థానీయమయిన 'త' వర్ణము కన్పించుచున్నది. క్త్వార్థకములయందు 'ఇ' వర్ణకమే నిత్యముగానున్నది.

(7) ధాతువుతుదినున్న హల్లునకు ద్విత్వమును జేయుట వలనఁ గొన్నిటిలో భూతకాల క్రియారూపములగుట. ఉ॥ పుగుందేఞ (ప్రవేశించుచున్నాను) పుక్కేఞ (ప్రవేశించితిని) నగు=నవ్వు. నక్కేఞ=నవ్వితిని.

(8) ధాతుగతములగు నచ్చులను బొడిగించుట వలన నామము లగుట. ఉ॥ (త) పడు = (పడు) పాడు. (పాటు) కొళ్ (కొను) కోళ్ (కొనుట = కోలు) సుడు = (కాల్చు) సూడు (వేఁడి)

పయినిఁజూపఁబడిన ద్రావిడభాషల సామ్యముల నన్నిటిని మనసునం దుంచుకొని సితియనులును, ద్రావిడులును,

ఆర్యులును ద్రావిడులును నొక స్థలముననే నివసించి యుండవలయునని యును వారినుండి ముందు ద్రావిడులు విడి హిందూస్థానముఁ బ్రవేశించిరనియును దరువాతఁ జాలకాలమునకు నార్యులు హిందూదేశముఁ జొచ్చిరనియును కాల్డ్వెల్లుగా రూహించు చున్నారు.

[ఈ ప్రకరణము నందలి యుక్తులన్నియును కాల్డ్వెల్లుగారి పుస్తకమునుండియే గ్రహింపఁబడినవి. వానికి మాత్రము గొన్ని కొన్ని స్థలములలో వివరణములు చేర్పఁబడినవి.]

---

# VIII. సంస్కృత ప్రాకృతములకును ద్రావిడ భాషలకును గల సంబంధము.

---

సంస్కృత ప్రాకృతములకును ద్రావిడ భాషలకును గల సంబంధమును బరిశీలించుటకు ముందు సంస్కృత ప్రాకృత భాషలయొక్క చరిత్రములను సంగ్రహముగాఁ దెల్పుట యావశ్యకము. ఈసందర్భమున నిండోయూరపియను భాషాశాస్త్రజ్ఞుల సిద్ధాంతములనే యుదాహరింతుముగాని వాని పయిఁ బూర్వపక్షముల నెత్తుకొని తత్ఖండనమునకుఁ గడంగుట యీ గ్రంథ విషయమున కంతగా సంబంధించినది కాదు గావున, నాపనిని విడిచిపెట్టెదము.

ఆర్యభాషలన్నిటికిని స్వభావమునఁ గనుపట్టు సామ్యములన్నిటిఁబట్టి యాభాషల మాటాడు జనుల పూర్వులందఱును నెప్పుడో యొక్కకాలమున నొక్క దేశముననుండి యొక్క భాషనో లేక యొక భాషయొక్క మాండలిక భేదములనో వాడుచుండిరని యూహింపనగును. ఆర్యభాషలను మాటాడు జనులు హిందూదేశమునందును పెరిషియాలోను మాత్రమే గాక ఐరోపాఖండమునందనేక స్థలముల నుండుటఁబట్టి వీరందఱును నొక్కచోటనే యుండిన వారనియు నూహింపఁబడుటచేతను వీరి ప్రాథమిక నివాసస్థానము ఉత్తరపు రషియాలోనో, దానికి సమీపభూములలో నెక్కడనోయుండి యుండునని

యూహింపఁబడినది. వారిలోఁ గొందఱు దక్షిణదిక్కునకుఁ బయినమయి హిందూదేశము వైపునకు వచ్చిరనియు మఱి కొంతకాలమునకు పెరిషియా, ఆఫ్ఘనిస్థానము, కాశ్మీరము అను దేశములకుఁ బయి భాగమున మజల రెండు చీలిక లయిరనియును నూహింపఁ బడినది. అందొక శాఖ హిందూ దేశమునకును మఱియొక శాఖ పరిషియా దేశమునకును బోయిరి. ఈ శాఖవా రగ్నిపూజా ధురంధరులు. వీరినాంగ్ల భాషయందు జూరాష్ట్రియనులని చెప్పుదురు. వీరికిఁ బ్రాచీన మతగ్రంథము 'అవెస్త' యనునది. ఇందుఁ గొంత భాగము 'గాథా అవెస్తిక్' అనఁబడెడు మాండలిక భాషాభేదమున వ్రాయఁబడినది. ఈ భాషయొక్కయు వైదిక సంస్కృతము యొక్కయు స్వభావమును బరిశీలించినయెడల నయ్యవి యేక భాషాభవములని నిశ్చయింపక తప్పదు.

ఉ॥ { సం॥ అశ్వాః, అశ్మన్, మాతరః, చిత్రిస్, సించతి‑ పుత్రః.
{ అవెస్తను॥ అస్పాః, అస్మన్, మాతరో, చిస్తిశ్, హించతి, పుత్రో.

కావున 'ఆర్యులును' 'ఇరేనియనులును' నొక్క జాతివారనుట నిశ్చయము. ఇంతియగాక యామతగ్రంథముల యందలి విషయములుగూడ నైక్యమునే బోధించుచున్న వనుట పయి యూహను బలపఱుచు చున్నది.

ఆర్యులు హిందూదేశమును ఖైబరు మార్గమునఁ బ్రవేశించి సింధునదీ తీరమునను గ్రమక్రమమున గంగానదీ తీరమునను గూడ వ్యాపించిరని ఋగ్వేదమును బరిశీలించి

శాస్త్రజ్ఞులూహించి యున్నారు. ఆర్యులు హిందూదేశ మున ననేక యుద్ధములఁ జేసిరనియు నందు సాహాయ్య మొసరుప నింద్రుఁడు మొదలగు దేవతలను బ్రార్థించు చుండి రనియును బయి వేదగతములగు ఋక్కులవలన నూహింపఁ బడినది. ఈ యార్యులు పోరాడుచుండిన శత్రువులను, దస్యులనియు నిషాదులనియు వ్యవహరించుచుండినట్లు ఋగ్వేదముననే యుదాహరణములు కన్పట్టుచున్నవి. ఆర్యులభాష సంస్కృతము. వీరి గ్రంథములగు వేదములలోనిభాష వైదిక సంస్కృత మనియు నాభాషకును వారి వ్యవహారములోని భాషకును గొంతభేద ముండవలయుననియుఁ బయివైదిక సంస్కృతము యొక్క వికృతియే మధ్యకాలపు సంస్కృతమనియు నూహింపఁ బడినది. పురాణములందును, గావ్యములయందును నున్న సంస్కృత మిట్టిదియే. నిరుక్తకారులగు యాస్కాచార్యుల వారు తమ కాలమునందలి సంస్కృతమునకును వైదిక సంస్కృతమునకును భేదము నుద్దేశించినట్లు శాస్త్రజ్ఞులు వ్రాయుచున్నారు. పాణిని కాత్యాయ నాదులును వైదిక సంస్కృతమునకును లౌకిక సంస్కృతమునకును భేదము నంగీకరించిరి.

కాలక్రమమున భాషలన్నియు మారునట్లే వైదిక కాల సంస్కృతముగూడ మారినది. ఆ సంస్కృతమునందలి గ్రాంథిక భాషావికారమే పాణిన్యాదుల సంస్కృతము. ఈ ప్రాకృత భాషాభేదములనుండి వచ్చినదియే పాళీభాషయని డాక్టరు భాండార్ కారుగారు మొ॥ వారూహించుచున్నారు. బౌద్ధయుగము నందీపాళీభాషలో ననేక బౌద్ధగ్రంథములు వ్రాయఁబడినవి. దేశమునందు వాడుకలోనుండు భాషలో వ్రాసిన గ్రంథములు దేశీ

యులను దమ మతానుయాయులఁగాఁ జేయుట కుపయోగిం చును గావున నా భాషయందే బౌద్ధులు తమ గ్రంథములను వ్రాసిరి. అశోకుఁడు తన శాసనములను (క్రీ॥ పూ॥ 273-221) హిందూదేశమున స్థాపించెను. ఆ శాసనములందలి ప్రాకృత భాషకును పాళీభాషకును గొంత భేదము కలదు. ఆ తరు వాతఁ బ్రాకృతభాషావ్యాకరణములందును గ్రంథములందును బ్రాకృతభాష వివరింపఁబడినది. ప్రాకృతభాషా వ్యాకర్తలలోఁ బ్రథముఁడగు వరరుచి మాహారాష్ట్రీ, పైశాచీ, మాగధీ, సౌర సేనీ యను నాలుగు ప్రాకృత భేదముల నుదాహరించుచున్నాఁ డు. పండ్రెండవ శతాబ్దమున నుండిన హేమచంద్రుఁడు పయి నాలుగు గాక, ఆర్షము (ఇది అర్ధమాగధీ యను దానితో నభి న్నము) చూళికా పైశాచికము, అపభ్రంశము, అను మూఁడు భేదములను జెప్పుచున్నాఁడు. పయిప్రాకృతములనుండి యుత్తర హిందూస్థాన దేశభాషలు వచ్చినవి. మాహారాష్ట్ర్యపభ్రంశము, మరాటీయనియును; గుజరాతీ, రాజస్థానీ, పంజాబీ, పశ్చిమ హిందీ మొదలగునవి సౌరసేన్య పభ్రంశములనియుఁ దూర్పు హిందీయును దానికిఁ జేరిన మాండలిక భేదములును అర్ధమా గధ్యపభ్రంశములనియును, ఒరియా, బంగాళీ, బీహారి మొ॥ మాగధ్యియపభ్రంశములనియు నూహింపఁబడినవి. పయిదేశభా షలలో దేనినిగాని, కేవల సంస్కృత భవములనిగాని, పాళీభవ ములని గాని నిర్ణయింప నలవిగాదు. పయి భాషలయం దన్నిటి యందును దత్సమ తద్భవపదములు తెనుఁగునందు వలెనే వాడఁబడుచున్నవి,

పయి క్రమమునుబట్టి నవ్యములనఁదగు ప్రాకృతముల కుఁగాని, ప్రాకృత భవంబులును నవీన తరంబులును నగు దేశభాషలకుఁగాని ద్రావిడభాషా జనకత్వమును నంటఁగట్ట నెంచుట యెట్టిదో పాఠకు లూహించుకొనఁజాలకపోరు. వైదిక కాలమునందే యుండినవని నిర్ణయింపఁదగినవి గదా ద్రావిడ భాషలు. ద్రావిడభాషాపదము లనేక ప్రాచీన గ్రంథములలో నుండినట్లు కాల్డ్వెల్లుగా రుదాహరించియున్నారు.

జన్యజనక భావము లేదనునప్పుడు ద్రావిడభాషలకును సంస్కృత ప్రాకృతములకును గల సంబంధమేమియో వివరింప వలయును. ద్రావిడభాషలు సంస్కృత నిక్షేపమునుండి విజ్ఞాన స్వర్ణమును బదరత్నములను లెక్కకు మిక్కిలి గ్రహియించి నవి. అనేకపదముల నప్పుదెచ్చుకొని తత్సమములను పేరఁ దమలోఁ గలిపికొనినవి. తద్భవములను పేర మఱికొన్ని పద ములపయిఁ దమకు స్వామ్యమును గల్పించుకొనినవి. శాస్త్ర రూపమునను, బురాణ రూపమునను, గావ్యరూపమునను నందున్న విజ్ఞానమును గ్రహియించినవి. తెనుఁగునందలి వ్యాక రణములన్నియును సంస్కృత వ్యాకరణానుకరణము లనుటలో నసత్యమున్నదా? తెనుఁగు వ్యాకరణముల నిర్ణయింపఁబడని విషయములు సంస్కృత వ్యాకరణ మర్యాద ననుసంధింపదగి నవను వైయాకరణుల వాక్యము లిందులకుఁ బ్రమాణ ములు గావా! తెనుఁగునందలి వేదాంత శాస్త్రమునకును, బురాణములకును, గావ్యములకును మూలము సంస్కృత విజ్ఞానమేగదా! ఒకటి యెక్కువగా గ్రహియించెననియు మఱి యొకటి తక్కువగా గ్రహించెననియును జెప్పిన జెప్పనగును.

గాని సాంస్కృతిక విజ్ఞాన ప్రవాహముననే యఖిల నాగరక ద్రావిడభాషా వృక్షముల యాలవాలములు పూరింపఁబడిన వనుటలో శంకా లేశమును గూడఁబొంద నక్కఱలేదు. ప్రాకృతభవములును ప్రాకృత సమములునుగూడ నాంధ్రము నందు గ్రహియింపఁబడినవనుటకు బాల వ్యాకరణమే ప్రమా ణము. పయి ప్రకారమున మహా విశాలమగు సంబంధముండి నను జన్యజనక భావముగాని సోదర భావముగాని పయి భాష లకు లేదనుట నిశ్చయము. ఈ నాఁడు హిందువులాంగ్లేయుల విద్యలను, భాషను, శాస్త్రములను జదువుకొనుచు, వారియభ్యా సములననుకరించుచు, వారి వేషమునుగూడ నెరవుదెచ్చుకొని దేశీయ విజ్ఞానమునకును, నార్ష సంప్రదాయములకును దూరు లయ్యును నాంగ్లేయ భవులనిగాని తద్వంశము వారనిగాని యెవ్వరిచేనైనను జెప్పఁబడుచున్నారా. పయి యాంగ్లేయుల కును నవీన నాగరకతా ప్రవాహమునఁబడిన హిందూ యువ కులకును నెట్టి సంబంధమో పయి భాషలకును నట్టి సంబంధ మున్నదని యూహింపనగును.

ద్రావిడభాషలు సంస్కృతముకంటె భిన్నములును, దానితో సమకాలికములును నగుట నయ్యవి సంస్కృతమునం దుండి యెట్లు పదజాలమును గ్రహియించెనో యట్లే సంస్కృత మును ద్రావిడభాషలనుండి కొన్ని పదములను గ్రహించి యుండు నని యూహించి యట్టివని వారూహించిన పదములను, కిట్టెలు, గుండెర్టు, కాల్డువెల్లు మొ॥ వారు తమ గ్రంథములలో నిచ్చిరి.

ఇఁక వైదికకాల సంస్కృతమునుండి ప్రాకృతాదులే కారణమువలనఁ గలిగినవను ప్రశ్నమునకు సమాధాన మీయ

వలయును. భాషకుఁ గాలక్రమమునఁ గలుగు మార్పే దీనికిఁ గారణమని కొంద అనుచున్నారు. ఈ యభిప్రాయములోఁ జాలవఱకు సత్యమున్నదనక తప్పదు. ఆర్యులు హిందూదేశమునకు వచ్చినప్పుడుండిన జనుల వాడుకనుండి సంస్కృతము భ్రష్టమయి యుండపచ్చునని కొందఱి యూహ. ఈ సందర్భమున 'గుణె' గారు తమ గ్రంథములలో వ్రాసిన విషయమును దాహరింతును.

"But the whole thing is clear when we imagine to ourselves all that must have happened when the Indian Aryans penetrated into India. They did not find before them a desolate, isolated world or a world inhabited by a handful of negroes. Very probably they conquered land inch by inch from the Dravidians and such other people who were in possession of the land before them. They inflicted not only their rule but also their superior language upon these natives, to whom it was a strange and difficult idiom. They learnt the new language just as children learnt their mother tongue, whatever is rough they soften, whatever is difficult they make easy. The process of this acquisition is strictly psychological, as explained in the first part of this book. Thus all the phenomena called antithesis, assimilation, dissimilation, etc., are seen to play a considerable role in

phonology and what we know as analogy formation in morphology. The Aryan dialects were thus corrupted in the mouth of the original inhabitants and these corruptions reacted upon the speech of the Aryan settlers. This is the most plausible explanation of the group of the Pali and Prakrits."

పయి వాక్యములనుబట్టి ద్రావిడభాషలు సంస్కృతాపభ్రంశములగు ప్రాకృతాదుల యుత్పత్తికిఁ గొంతవఱకు హేతుభూతములని వారి యభిప్రాయము తెల్లము. డాక్టరు భాండార్కరుగారు తమ భాషా శాస్త్రోపన్యాసములలోఁగూడఁ బయి యభిప్రాయమునే తెలిపుచ్చియున్నారు. తెనుఁగునందలి దంత్యచజలకును, ద్రావిడభాషలలోని హ్రస్వరూపములగు ఎ, ఒ, అను నచ్చులకును, ప్రాకృతభాషా దంత్యచజలకును, నందలి హ్రస్వవక్రములకును హేతు హేతుమద్భావమును గల్పింపనగునా, లేదా ? ఇఁక ద్రావిడభాషా ప్రాకృత జన్యత్వము, 'మనోరథా నామగతిర్న విద్యతే' యను న్యాయంబున మనోరథగతి ప్రాప్యంబే యనుట నిశ్చయముగాదా! కొన్ని ద్రావిడ శబ్దములకు ప్రాకృతజన్యత్వమును సంస్కృత జన్యత్వమును గలదా లేదా యను వివాద మెప్పుడునుండిన నుండవచ్చును గాని ద్రావిడభాషల కెల్లైనను బ్రాకృత భాషా జన్యత్వమును గట్టిపెట్ట వలయునను నుద్దేశముతోఁ గల్పింపబడిన వ్యుత్పత్తులు వ్యుత్పన్నుల హాసోత్పత్తికి నిమిత్తము లనుటలో విప్రతిపత్తి లేదు గదా.

ఇఁక నార్యులతో యుద్ధముచేసినవారు ద్రావిడులా, మఱియొకజాతివారా యను సందేహములవంటి వనేకములు గలుగవచ్చునుగాని వానికన్నిటికి నుత్తరమిచ్చుట కిదియదను గాదనియు నుసాధము గాదనియుఁ బయి వాదమును బండిత మండనులు నిష్పాక్షికముగాఁ బరీక్షింతురుగాక యనియు నింతటితో విరమించుచున్నాము.

ఓం తత్సత్.

సంపూర్ణము.





Printed at the Ananda Press, Madras—1931.